జూలై - ఆగస్టు 2019



# కొత్తపల్లి

తెలుగు పిల్లల ఈ మాసపత్రిక వెల రూ.30/-

Adavi....

చెట్లు నాటుదాం!




సంపుటి: 5 సంచిక: 3 పుటలు: 68 విడి ప్రతి వెల: 30 రూ. జులై-ఆగస్టు 2019



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670, 9490180695

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2018-2020

**స్ఫూర్తి :** యు. సుబ్బరాజు

**సంపాదకులు:** జి.వి. నారాయణ శర్మ

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**చిత్రాలు:**

**అడవి రాముడు : 9491870753**

రాధా స్కూల్ (అనంతపురం) లో చదివే పిల్లలు

**వాణిజ్యం, మార్కెటింగు:**

బి. అశోక్: 9963571510




# విషయ సూచిక






ముఖచిత్రం: చెట్లు నాటుదాం
చిత్రకారుడు: సి. రాము

కొత్తపల్లి 105 వ పుస్తకం!

# బాధ్యతగా ఎదుగుదాం!

కాశీ రాజ్యాన్ని పాలించే బ్రహ్మదత్తుడికి నలుగురు కొడుకులు ఉండేవాళ్ళు. వాళ్లలో మొదటివాడు ఒకసారి అడవికి పోయినప్పుడు, పెద్ద చెట్టు కాడం ఒకటి చూసాడు. బోడిగా, ఎండిపోయినట్లు నిలబడి ఉందది. అతను తనతో పాటు ఉన్న రథసారధిని 'ఇదేం చెట్టు, ఇట్లా ఉంది?' అని అడిగాడు.

"దీన్ని 'పలాశ చెట్టు' అంటారు యువరాజా!" అన్నాడు సారధి.

ఆ తర్వాత కొంత కాలానికి రెండో యువరాజు అదే ప్రాంతంలో తిరుగుతూ, కొమ్మలతోటీ-రెమ్మలతోటీ విస్తరించి ఉన్న పెద్ద చెట్టును ఒక దాన్ని చూసి, "ఆదేం చెట్టు?" అని అడిగాడు సారధిని.

దాన్ని 'పలాశ చెట్టు' అంటారు యువరాజా!" అన్నాడు సారధి.

మళ్లీ కొన్నాళ్లకి యీసారి మూడోవాడు వెళ్లాడు, అటువైపు. అక్కడొక చెట్టు ఎర్రెర్రని పూలతో, నిండుగా కనిపించింది. "అదేం చెట్టు, అట్లా ఉంది?" అని అడిగాడు అతను.

దీన్ని 'పలాశచెట్టు' అంటారు ప్రభూ!" అన్నాడు సారధి.

కొద్ది రోజులకు నాలుగో వాడు అటు వెళ్లి చూసి, అదే ప్రశ్న వేసాడు: 'ఇంతలేసి కాయలు కాసింది పచ్చగా, ఇదేం చెట్టు?' అని.

దీన్ని 'పలాశ చెట్టు' అంటారు యువరాజా!" అన్నాడు సారధి.

ఆ తరువాత యువరాజులు నలుగురూ మాట్లాడుకుంటుంటే ఏదో సందర్భంలో పలాశ చెట్టు ప్రస్తావన వచ్చింది:

"నేను చూసాను. అది బోడి కాండంలాగా ఉంటుంది" అన్నాడు మొదటివాడు.

"కాదు! మర్రి చెట్టులాగా పెద్ద వృక్షం అది! దాని నిండా ఆకులుంటాయి!" అన్నాడు రెండవ వాడు.

"ఉహూ! మాంసం ముద్దల్లాగా పూలుంటాయి. నాకు తెలుసు!" అన్నాడు మూడోవాడు.

"లేదు, లేదు! ఆకుపచ్చ కాయలుంటై!" అన్నాడు నాలుగోవాడు.

నలుగురూ "నేను కరెక్టంటే నేను కరెక్టు" అని గొడవపడుతుండగా, వాళ్ల నాన్న అటుగా వచ్చి, వాళ్ళ మాటలు విని, నవ్వాడు: "మీరంతా దాన్ని చూశామనుకున్నారు; బాగానే గుర్తు పెట్టుకున్నారు; కానీ దాన్ని 'ఏ సమయంలో చూశాం' అనేది గమనించలేదు. ప్రపంచంలో 'కాలం' అనేది మహాద్భుతమైన వస్తువు. కాలంతో పాటు మారిపోనివి యీ సృష్టిలో ఏవీ లేవు. అన్నీ అనుక్షణం మార్పుకు లోనయ్యేవే!" అని చెప్పి సర్దుబాటు చేశాడట.

ఇందులో మనం పిల్లలం గమనించాల్సింది ఒకటుంది: రాను రాను అందరం పెద్దవాళ్ళం అవుతాం కదా, ఎలాగూ? అయితే 'ఎట్లాంటి పెద్దలం అవుతున్నాం?' అని గమనించుకుంటుంటే చాలు- అందరం బాధ్యత గల వాళ్ళుగా ఎదుగుతాం.

బాధ్యతగా ఎదిగే పిల్లలందరికీ అభినందనలతో,

కొత్తపల్లి బృందం.

వేమన పద్యం:

అన్ని దానములను నన్న దానమె గొప్ప
కన్న తల్లి కంటె ఘనము లేదు
ఎన్నగురుని కన్న నెక్కుడు లేదయా
విశ్వదాభిరామ, వినుర వేమ!

భావం: ఓ వేమా! దానాలన్నిటిలోకీ అన్నదానమే గొప్పది. కని పెంచిన తల్లి కంటే లోకంలో గొప్పవారెవరూ లేరు. ఎంచి చూస్తే విద్యాబుద్ధులు నేర్పిన గురువు కంటే గొప్పవారు కూడా ఎవ్వరూ లేరు.




---

యా సాధూంశ్చ ఖలాన్ కరోతి విదుషో మూర్ఖాన్ హితాన్ ద్వేషిణ:
ప్రత్యక్షం కురుతే పరోక్షమమృతం హలాహలం తత్క్షణాత్ ।
తామారాధయ సత్క్రియాం భగవతీం భోక్తుం ఫలం వాంఛితం
హే సాధో వ్యసనైర్గుణేషు విపులేష్వస్థాం వృథా మా కృథా: ॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

ఖలునిన్ సజ్జనుగాగ, మూర్ఖ జను సంఖ్యావంతునింగాగ, రా
యల సన్మిత్రులగా; నగోచరము బ్రత్యక్షంబుగా, బ్రాణ హృత్
కలనంబైన మహావిషంబమృతముగా జేయు సత్కర్మము-
జ్జ్వల నిష్ఠా నిధివై భజియింపుము వయస్యా, వాంఛితార్థాప్తికిన్

భావం: మిత్రమా! దుర్మార్గుడిని కూడా మంచివాడిగా, మొద్దుని కూడా తెలివైనవానిగా, రాజులని కూడా మంచి స్నేహితులుగా, కనబడని దాన్ని కనిపించేట్లుగా, ఘోరమైన విషాన్ని కూడా అమృతంలాగా చేస్తుంది "మంచిపని". అట్లాంటి మంచి పనిని గట్టి పట్టుదలతో చేయాలి.



# సెలవలైపోతున్నాయ్!

బిట్టు కథలు

*జరిగిన కథ: బిట్టు ఢిల్లీ పిల్లాడు. సెలవల్లో అమ్మమ్మ వాళ్ల ఊరు వచ్చాడు. ఇక్కడికొచ్చి చుట్టూ ఉండే విషయాలు చాలా నేర్చుకున్నాడు. స్నేహం చెయ్యటం, పక్షుల్ని జంతువుల్ని ప్రేమించటం, ఇతరులకు సాయం చెయ్యటం లాంటి సంగతుల్ని, తెలుగులో రాయటాన్ని, చదవటాన్ని అన్నిటినీ ఈ కొద్ది కాలంలోనే నేర్చుకున్నాడు. ఇప్పుడింక వెనక్కి వెళ్ళిపోయే సమయం దగ్గర పడుతున్నది..*

*రచన : శ్రీమతి అనురాధ నాదెండ్ల, పోరంకి, కృష్ణాజిల్లా.*

ఆరోజు రాత్రి భోజనాలయ్యాక "ఇదిగో, అమ్మతోటీ-నాన్నతోటీ మాట్లాడు" అంటూ ఫోనులో నంబరు కలిపి ఇచ్చారు తాతయ్య.

ఫోను ఎత్తినాక వాళ్ళమ్మ సునందకి అసలు మాట్లాడే అవకాశమే ఇవ్వలేదు బిట్టు: అమ్మమ్మ ఇంట్లో ఏమేం జరుగుతున్నాయో అవన్నీ ఉత్సాహంగా చెప్పేస్తూ పోయాడు: పిచ్చుకల్ని పెంచుకోవటం గురించి చెప్పాడు;

'దానివల్ల పిచ్చుకల సంఖ్య పెరుగుతుంది' అని తాతయ్య మెచ్చుకున్న సంగతి చెప్పాడు; తన వల్లనే తాతయ్య, అమ్మమ్మ పిచ్చుక గూడుని ఇంట్లోకి తెచ్చారని చెప్పాడు; దావీదు ప్రొద్దున్నే న్యూస్ పేపర్లు వెయ్యటం, స్కూటర్ తగిలి క్రింద పడిపోయి దెబ్బలు తగలటం, తాతయ్య దావీదుని చదివిస్తానని మాట ఇవ్వటం, అన్నీ చెప్పాడు.



అటుపైన తన క్రొత్త స్నేహితులు రమ్య, రాహుల్ గురించి; జయమ్మమ్మ రెయిన్బోగాడిని విసుక్కుందనీ, కానీ ఆ తర్వాత వడియాలు ఎండబెట్టినప్పుడు కోతుల గురించి రెయిన్బో గాడు హెచ్చరించాడనీ, అప్పట్నుంచి జయమ్మమ్మ వాడిని ఇష్టంగా చూస్తోందనీ చెప్పాడు.

కమలమ్మ ఇంట్లో కరీనా అనే ఒక గేదె ఉందని, అది ఒక బుజ్జి దూడని ఈనిందని, జున్ను పాలతో అమ్మమ్మ అందరికీ జున్ను వండిందని' చెప్పాడు. అలా చెబుతున్నప్పుడు నాలుక మీద మెదిలిన జున్ను రుచికి వాడి మాట తడబడింది కూడా!

-అన్నీ వింటోంది సునంద. వాడికి అక్కడ బాగుందని ఆమెకి అర్థం అయ్యింది. జున్ను పేరు ఎత్తేసరికి ఆమెకు కూడా జున్ను తినాలని ఆశ పుట్టింది; కానీ పాపం, ఏమీ చెయ్యలేక నిట్టూర్చింది. అకస్మాత్తుగా చెప్పింది: 'నాన్న-నేను ఇద్దరమూ నిన్ను చాలా మిస్ అవుతున్నాంరా, బిట్టూ! నీకేమో అక్కడ బోలెడు ప్రపంచం తయారైంది... నేను ఇంకో వారం రోజుల్లో వస్తాను అక్కడికి సరేనా? ఆ తర్వాత మనిద్దరం కలిసి మళ్ళీ మన ఊరు దిల్లీకి వెళ్ళిపోదాం. నీకిక్కడ స్కూలు ఇంకో పదిరోజుల్లో తెరుస్తారు కదా?!'

-బిట్టు ఉలిక్కిపడ్డాడు. 'అమ్మ వచ్చేస్తుందా? తనని దిల్లీ తీసుకెళ్లిపోతుందా? అప్పుడే సెలవులు అయిపోయాయా?!' బిట్టుకి ఏడుపొచ్చినట్లు అయ్యింది. ఏం మాట్లాడాలో తెలియలేదు. అమ్మ చెప్పే సంగతులన్నీ ఊరికే వినటం మొదలు పెట్టాడు మౌనంగా.



అక్కడే ఉండి వాడిని గమనిస్తూన్న అమ్మమ్మ కంట్లో నీళ్లు తిరిగాయి: 'నెల రోజులుగా వీడు గలగలా మాట్లాడుతూ ఇల్లంతా తిరుగుతుంటే, అందరం ఒకరికొకరం అలవాటు పడిపోయి, 'అసలు వాడు ఇక్కడి వాడే' అన్న ధోరణిలోకి వచ్చేసాం' అని అవిడకి అర్థమైంది. 'ఇప్పుడింక వాడు వెళ్తాడు. మళ్లీ వేసవి సెలవుల కోసం ఎదురు చూడాల్సిందే. అంతకు మించి చెయ్యగలి-గింది లేదు..' అని విచారం వేసింది ఆమెకి కూడా.

'పోనీ, అమ్మా....నేను ఇక్కడే దావీదు, చిట్టితో పాటు చదువుకోనా?' బిట్టు ఫోనులో అడుగుతున్నాడు.

వాడి ప్రశ్నకి తాతయ్యకీ దిగులేసింది. ఒక్కసారి అమ్మమ్మ మనసులో ఆశ కలిగింది- బిట్టుని తమతోబాటే ఉంచుకుని చదివిద్దామని. కానీ అంతలోనే 'వాళ్ల అమ్మ-నాన్నల దగ్గరికెళ్లద్దూ, బిట్టు?' అనుకుంది. 'ఇక్కడ చిట్టి, దావీదు ఉంటారు కదా, ఇంట్లో పిల్లల్లాగా? మాకు కాలక్షేపం చేస్తారులే' అని సరిపెట్టుకుంది.

ఆరోజు బిట్టు తన మంచం మీద పడుకోకుండా అమ్మమ్మ ప్రక్కన చేరాడు. వాడి మనసులో దిగులు అమ్మమ్మకి తెలుసు. కానీ వాడు వాడి అమ్మ-నాన్నల దగ్గర పెరగటమే న్యాయం కదా? వాడి చదువులు,

ప్రపంచం అంతా అక్కడే ఉంది. వాడు పోరంకికి సెలవుల్లో మాత్రమే రాగలడు- ఊరికే, ఒక ఆటవిడుపుగా. అంతే. బిట్టు తల నిమురుతూ నిమురుతూ కూడా అమ్మమ్మ ఇదే ఆలోచనలో పడి, వాడికి కథ చెప్పటం మరిచిపోయింది. చటుక్కున తేరుకొని చూస్తే, ఆ సరికే వాడు నిద్రలోకి జారిపోయాడు.

ప్రొద్దున్నే కమలమ్మతో పాటు వచ్చింది చిట్టి. బిట్టూ తనకి చెప్పేసాడు: "మా అమ్మ వస్తోంది. నేను అమ్మతో పాటు దిల్లీకి వెళ్లిపోతున్నాను" అని. చిట్టి కూడా కాస్సేపు దిగులు పడింది. అంతలోనే ఆరిందాలా 'బిట్టూ! మీ అమ్మా, నాన్న నీకోసం ఎదురు చూస్తూ ఉంటారు కదా; దిల్లీలో నీ స్నేహితులు, మీ జావేద్ అంకుల్ అందరూ 'నువ్వు ఎప్పుడు వస్తావో' అని చూస్తూ ఉంటారు. నువ్వు ఇప్పుడు వెళ్లి, ఈసారి మళ్లీ వేసవి సెలవులివ్వగానే వచ్చెయ్యి. అప్పుడు మాకు మళ్ళీ క్రొత్త క్రొత్త సంగతులు చెబుదువుగాని. సరేనా?!' అంది. బుద్ధిగా తలూపాడు బిట్టు.

ఆరోజు రెయిన్బో గాడికి స్నానం చేయిస్తూ, 'అమ్మమ్మా, నేను రెయిన్బో గాడిని దిల్లీ తీసుకెళ్తాను' అని చెప్పాడు బిట్టు ఉత్సాహంగా.

అమ్మమ్మ మాత్రం 'అది కుదరదు' అంది. 'వీడిని దిల్లీ తీసుకెళ్తే, అక్కడ నువ్వు, అమ్మ, నాన్న- అందరూ బడులకు, ఆఫీసులకు వెళ్లిపోతే, అప్పుడింక రెయిన్బోగాడిని ఎవరు చూసుకుంటారు? అదీకాక అక్కడ అపార్ట్మెంట్లలోకి కుక్కపిల్లల్ని అనుమతించరు; ఇక్కడైతే మేమందరం వాణ్ని చూసుకుంటాం. వాడు ఆడుకునేందుకు బోలెడు స్థలం ఉంటుందిక్కడ. నువ్వు మళ్లీ వచ్చేసరికి చక్కగా పెద్దవాడు అవుతాడు కూడా. అప్పుడు నువ్వు బలే ఆడుకోవచ్చు వాడితో..' అమ్మమ్మ మాటలు విని ఆలోచనలో పడ్డాడు వాడు.

'బిట్టూ దిల్లీ వెళ్ళిపోతున్నాడు' అన్న వార్త ఆరోజు సాయంత్రం కల్లా పిల్లలందరికీ చేరింది. అందరికీ దిగులు మొదలైంది. వాళ్ల

దిగులు మరిపించటం కోసం అమ్మమ్మ కమలమ్మ సాయం తీసుకొని పూరీలు, మైసూర్‌పాక్ చేసింది. ఆ ఇష్టమైన పలహారాలు చూసాక పిల్లల ముఖాల్లోకి కొద్దిగా సంతోషం వచ్చి చేరింది.




'బిట్టు వెళ్ళిపోతాడు' అన్న వార్త తాతమ్మకి కూడా చేరింది. వాడు వెళ్తాడంటే ఆమెకి కూడా ఏమీ తోచకుండా అయ్యింది. చక్కగా తనకి ఏం కావాలంటే అవి అందిస్తాడు; బోలెడు కబుర్లు చెబుతాడు; పాటలు పాడతాడు; తాతయ్యతో షికారు వెళ్తాడు; తను చేసే పనులన్నీ ప్రక్కనే కూర్చుని గమనిస్తాడు.. వాడు కాస్తా ఇప్పుడు దూరం వెళ్తున్నాడంటే ఆవిడకి కూడా నచ్చటం లేదు. కానీ ఏం చెయ్యాలి?!

అప్పటికీ 'మణీ, నువ్వు ఆమాత్రం పెంచలేవటే, పిల్లాడిని?! అయినా చంటి వెధవ- వాడికి ఏం చెయ్యాలి గనక?! వాడే నీళ్లు పోసుకుంటాడు; వాడే తల దువ్వుకుంటాడు; ప్రొద్దున్నే కాస్త అన్నం పెట్టి బడికి పంపటమేగా? ఆమాత్రం పని నువ్వు చెయ్యలేవూ? దిల్లీలో వాళ్ల అమ్మకి ఉద్యోగంతో ఎక్కడ తీరుతుంది, వాడిని చూసుకుందుకు?!' అంటూ కోడల్ని మెత్తబరచే ప్రయత్నం చేసింది.

"అన్నం పెట్టి బడికి పంపటం ఒక్కటే కాదు అత్తయ్యా, పిల్లవాడు పాపం అమ్మానాన్నల దగ్గర పెరగద్దూ?! వాడు లేకపోతే వాళ్లకీ బెంగే! పైగా వాడి చదువు కూడా ఉందాయె! ఇప్పుడు పంపించేసి, మళ్ళీ సెలవులకి తీసుకొద్దాంలెండి" అని అత్తగారికి సర్ది చెప్పింది మణి.

తాతయ్య కూడా కొంచెం దిగులు పడ్డారు కానీ, "వీడు దిల్లీ వెళ్లే లోపు అందరినీ

ఎక్కడికైనా పిక్నిక్ కి తీసుకెళ్లాలని ఉందిరా!" అన్నారు. అప్పుడప్పుడే రాష్ట్ర రాజధానిగా తయారవుతున్న అమరావతిలో మ్యూజియం, విజయవాడలో దుర్గగుడి దగ్గరలో అభివృద్ధి చేసిన భవానీ ద్వీపం వీళ్లకు చూపిద్దామని ఉండింది ఆయనకు.



బిట్టు వాళ్ళ అమ్మ సునంద ఇంకా నాలుగురోజుల్లో వస్తుంది, ఆమె వచ్చిందంటే ఇక సామాన్లు సర్దుకునే హడావుడి మొదలవుతుంది. ఈ లోపు రమ్య, రాహుల్ కూడా వాళ్ల ఊరుకు వెళ్లిపోతారు. అందుకని పిల్లలందరితో పాటు జయమ్మమ్మ, తాతమ్మ, కమలమ్మ, వీరబాబు లని కూడా పిక్నిక్ కి తీసుకు వెళ్లేందుకు ఏర్పాటు చేసారు తాతయ్య. ఒక ఒక పది పన్నెండు మంది పట్టే చిన్న వ్యాన్ ఒకటి ఏర్పాటు చేసి, అందరికీ సరిపడ పలహారాలు, భోజనాలు, మంచినీళ్ల సీసాలు పట్టుకుని, పిక్నిక్ కి బయలు దేరారు.

కొత్తగా తయారవుతున్న అమరావతి నగరం విజయవాడకు 33 కిలోమీటర్ల దూరంలో ఉంది. విజయవాడలో మామూలు జనాలు నివసించే ఇళ్ళు, గుళ్ళు, బళ్ళు ఉంటే, అమరావతిలో ప్రభుత్వం కట్టించే ఆఫీసులు, పెద్ద పెద్ద కాలేజీలు ఉన్నాయి.

రాష్ట్ర రాజధానిని నిర్మించటంలో భాగంగా క్రొత్త క్రొత్త రోడ్లు, భవనాలు తయారవుతున్నాయి అక్కడ. వాటినన్నిటినీ పిల్లలు ఆశ్చర్య పోతూ చూసారు.

బుద్ధుడి జీవిత విశేషాలను తెలియజేసే చిన్నమ్యూజియం ఒకటి ఉందక్కడ. అందులో క్రీ. పూ. 3 శతాబ్దం నుండి క్రీ. శ. 12 వ శతాబ్దం వరకు- ఆ మధ్య కాలానికి చెందిన వస్తువులను ఉంచారు. 'ఇవన్నీ త్రవ్వకాల్లో దొరికాయి' అని తాతయ్య చెబితే,

'అసలు అవన్నీ మట్టిలో ఎందుకు పూడిపోయాయట?!' అని ఆశ్చర్య-పోయారు అందరూ. అమరావతిలోనే ధ్యాన బుద్ధ విగ్రహాన్ని, బౌద్ధ స్థూపాన్ని చూసారు. క్రీస్తుపూర్వం 3 వ శతాబ్దం నాటి 'మహా చైత్య స్థూపం' అట అది.

అక్కడి నుంచి కృష్ణా నదిలో ఉన్న భవానీ ద్వీపం వెళ్లారు. ఆ ద్వీపం చేరేందుకు ఒక పడవ ఎక్కి వెళ్లాలి. చుట్టూ పచ్చని చెట్లు; ఒక ప్రక్కన కనకదుర్గ గుడి కొండ; మరో ప్రక్క ప్రకాశం బ్యారేజీ- వీటిని చూస్తూ పడవ ప్రయాణం! పిల్లలకి ఆ పడవ ప్రయాణం బలే నచ్చింది. పడవ మీద రెయిన్బో గాడు తెగ సందడి చేశాడు.

ఆ ద్వీపం చాలానే పెద్దది. మొత్తం 133 ఎకరాల స్థలమట. అక్కడ అంతా రకరకాల జల క్రీడలు- బనానా బోట్లు, స్వాన్ బోట్లు, స్పీడు బోట్లు, వాటర్ బెలూన్ లాంటివి అభివృద్ధి చేసారు. బోలెడన్ని చెట్లతో చక్కని అడవిలాగా కూడా ఉంది ఆ ప్రాంతం. చెట్ల కొమ్మలకు ఉయ్యాలలు, కొమ్మల పైన పైననే నడిచే 'రోప్ వే'ల్లాంటి ప్రత్యేకతలు కూడా ఉన్నాయి.

ప్రభుత్వంవారు పర్యాటకాన్ని అభివృద్ధి చేసేందుకు అక్కడ అనేక సాంస్కృతిక కార్యక్రమాల్ని కూడా ఏర్పాటు చేశారు. పర్యాటక శాఖ వారి అనుమతితో అక్కడ పిల్లల పుట్టిన రోజులు లాంటి వేడుకలు కూడా జరుగుతున్నాయి. చక్కని రుచికరమైన భోజనం కూడా దొరికింది. అక్కడే రాత్రి పూట కూడా ఉండచ్చుట! దానికి గాను అక్కడ చెట్టు కొమ్మల మీద నిర్మించిన ప్రత్యేకమైన కాటేజీలు కూడా ఉన్నాయి! పిల్లలంతా అక్కడ ఆడి-ఆడి, అలిసి పోయి ఇల్లు చేరారు.

(ఇక వచ్చేసారితో ముగింపు..)

## లోకజ్ఞానం!



టీచర్ : మూడు వందలు, మూడు యాభైలు, మూడు పదులు- కలిపితే మొత్తం ఎన్ని?

స్టూడెంట్: మొత్తం తొమ్మిది నోట్లు టీచర్ !

# కుంటిగొర్రె

కొత్త బేతాళం



పట్టువదలని ఇన్స్పెక్టర్ విక్రం మళ్లీ ఓ సారి చెట్టెక్కి, బేతాళాన్ని పట్టుకున్నాడు.

ఏమాత్రమూ గింజుకోకుండా, నిశ్శబ్దంగా తన వీపు మీద పడి వచ్చిన ఆ రోబోని చూసి అతనికి ఆశ్చర్యం అనిపించలేదు.

'ప్రతి నిశ్శబ్దమూ కూడా రాబోయే మహా ధ్వానా-నికి సూచికే కదా'

అని అతను అనుకున్నంతలో, బేతాళం కిర్రుమంటూ కదిలి, "విక్రమా! బలవంతులం అనుకునే వారికి ఎవరికైనా నాబోటి బలహీనుల్ని చూస్తే చవకగానే ఉంటుంది.

నిన్నే తీసుకో, చక్కగా నీ ఉద్యోగం ఏదో నువ్వు చేసుకోక, ఈ సిద్ధప్ప మాటలు వినటమేమిటి, ప్రాణమే లేని నన్ను ఇన్ని సార్లు పట్టుకోవటమేమిటి, చెప్పు? నీ వరకూ కూడా అక్కర్లేదు- అందరికీ ప్రభువైన ఆ దేవుడికి కూడా చిన్న ప్రాణులంటే

చులకనే. నువ్వు నన్ను ఎంత దూరం మోసుకెళ్ళాలో ఏమో. ఆలోగా శ్రమ తెలీకుండా నీకు ఓ కుంటిగొర్రె కథ చెబుతాను, విను. తెలుసుగా, మౌనం వదిలితే మటుకు నేను తిరిగి చెట్టెక్కుతాను!" అంటూ ఇలా చెప్పసాగింది:

చాలా వేల ఏళ్ల క్రితం, దేవుడు ఇంకా దయామయుడిగా ఉన్న రోజుల్లో, గొర్రెల కాపరి ఒకడు ఉండేవాడు. అతను చాలా కష్టజీవి. గొర్రెల్ని చిన్నగా ఉన్నప్పటినుండి సాకి, అవి ఒక వయసుకు చేరుకున్నాక అమ్మి, అలా జీవనం సాగించేవాడు.

గొర్రెల్ని పెంచటం అంటే మాటలు కాదు. వాటిని వెంటబెట్టుకొని కొండలు, గుట్టలు అన్నీ దాటుకొని, ఇల్లూ వాకిలీ వదిలి, గడ్డి ఎటు ఉంటే అటు పోవాల్సి ఉంటుంది.

గొర్రెల్లో చిన్నవీ, అప్పుడే పుట్టినవీ, బాగా నడవలేనివి కూడా ఉంటాయి. వాటిని ఒక్కోసారి ఎత్తుకొనీ, ఒక్కోసారి అదిలించీ, ఒక్కోసారి మరేవైనా మంచి పొట్టేళ్ల మీదికి ఎక్కించి, మిగిలిన వాటితో కలిపి త్రిప్పవలసి ఉంటుంది.

అతని దగ్గర రెండు కుంటి గొర్రెలు ఉండేవి. అవి రెండూ పుట్టటమే వెనక కాళ్లు చచ్చుగా పుట్టాయి.



అయినా గొర్రెల కాపరి వాటిని చిన్న చూపు చూడలేదు; వదిలి పెట్టలేదు. అట్లాగే చేతులమీద ఎత్తుకొని సాకాడు-

మిగిలిన గొర్రెలన్నీ ఎక్కడ మేస్తుంటే వీటిని అక్కడికి మోసుకెళ్లేవాడు. వీటిని అలా ప్రత్యేకంగా సాకటం చాలా కష్టమే,

అయినప్పటికీ అతను ఏమీ నొచ్చుకునే-వాడు కాదు.

దీన్నంతా గమనిస్తూన్న దేవుడు అతని కష్టాన్నైతే తగ్గించలేదు గానీ, ఇతరత్రా వీలైనన్ని లాభాలు, వసతులు కల్పిస్తూ వచ్చాడు.

అయితే గొర్రెలు మటుకు తమలో తాము బాధ పడుతుండేవి: "ఎందుకు, ఈ బ్రతుకు? ఇట్లా ఇంకొకరి మీద ఆధారపడి బ్రతకటం కూడా ఒక బ్రతుకేనా?" అని వాటి భాషలో ఏడ్చుకునేవి. "ఈ దేవుడికి దయలేదు. లేకపోతే మమ్మల్ని ఇలా ఎందుకు పుట్టిస్తాడు?" అని తిట్టేవి. అయినా దేవుడు వాటి తిట్లను పట్టించుకునేవాడు కాదు.

ఆ గొర్రెలు రెండూ పెద్దవి అవుతున్న కొద్దీ గొర్రెల కాపరి కష్టం కూడా ఎక్కువైంది. అతనిప్పుడు ఒక్కో కుంటి గొర్రెనీ ఒక్కోసారి ఎత్తుకొని పోవాల్సి వస్తున్నది. అవి కూడా బాగా బరువైనాయి గద! అయినా అతను ఏమీ బాధ పడలేదు. చిన్నప్పటినుండీ చూస్తున్నవే గనక, ఇప్పుడు కూడా తన పని తను చేస్తూ ఉండేవాడు.

కుంటి గొర్రెల్లో ఒకటి తెల్లది; ఒకటి నల్లది. తెల్లది ఒకసారి ఆ గొర్రెల కాపరి కష్టాన్ని చూసి చలించిపోయింది:



"అయ్యో! దేవుడా! మాదే కష్టం అనుకుంటే పాపం, యితనికి ఎన్ని కష్టాలు పెట్టావయ్యా?! మా కంటే కాళ్లు లేవు, నడవలేము; కానీ పాపం మమ్మల్ని మోసే కష్టాలన్నీ ఇతనికి ఇచ్చావుగదా?" అని

బాధపడింది. అంతలో దేవుడు చటుక్కున దాని ముందు ప్రత్యక్షమై 'సరేలే! ఇప్పుడు ఏం చేయమంటావో చెప్పు!' అన్నాడు.

"మాకు కాళ్లు ఇవ్వవయ్యా, స్వామీ! ఇతని కష్టాలూ, మా కష్టాలూ రెండూ తీరతాయి" అన్నది తెల్ల గొర్రె.

దేవుడు కొంచెం ఆలోచించి, "సరే, నీకు కాళ్లు ఇస్తాను; కానీ దానికి మటుకు ఇవ్వను-" అన్నాడు నల్ల గొర్రెకేసి సాలోచనగా చూస్తూ.

తెల్ల గొర్రె దేవుడికి దండంపెట్టి, "అంత ఆలోచించకు స్వామీ! నాకు ఒక్కదానికీ కాళ్ళిస్తే ఏం ప్రయోజనం; ఆ గొర్రెల కాపరి సమస్య తీరదు! అతను ఆ రెండో గొర్రెను మోస్తూనే ఉండాలి కదా! దయ చూడు!" అన్నది. దాంతో దేవుడికి సరేననక తప్పలేదు. గొర్రెలు రెండిటికీ కాళ్లు ప్రసాదించి మాయమయ్యాడు.

తన గొర్రెలకు కాళ్ళు వచ్చినందుకు గొర్రెల కాపరికి చాలా సంతోషమైంది. కుంటి గొర్రెల్ని మోసే పని లేదు గనుక, ఇప్పుడు అతను చిట్టి గొర్రెల్ని బాగా సంరక్షించగల్గుతున్నాడు. అన్నిటినీ మించి, అతను ఇప్పుడు అలిసిపోవటంలేదు!

కానీ కొద్ది రోజులు గడిచేసరికే నల్ల గొర్రెకి అసంతృప్తి మొదలైంది: 'ఇంతకు ముందు కాపరి తమని ఎత్తుకొని తిప్పేవాడు. ప్రేమగా ముచ్చట్లు పెట్టేవాడు. మిగిలిన గొర్రెలకంటే ప్రత్యేకంగా చూసేవాడు. ఇప్పుడు అతను తమని పట్టించుకోవట్లేదు. తమ వైపుకు కూడా చూడట్లేదు. పైగా మొన్న ఒకసారి మిగిలిన గొర్రెల్ని కొట్టినట్లు నన్ను కూడా ముల్లుకర్రతో కొట్టాడు!.. "ఇట్లా బ్రతికే కంటే అసలు కాళ్లు లేకుండా బ్రతకటమే మేలు!" అనిపించింది దానికి.

"దేవుడా! ఎందుకు ఇట్లా చేసావు? కాళ్ళిచ్చి మోసం చేసావే, మమ్మల్ని?!" అని ఏడ్చింది.

ఇన్నాళ్ళుగా దాని మొర పట్టించుకోని దేవుడు, ఈసారి మటుకు దాని ఏడుపు విన్నాడు. వెంటనే దాని కాళ్లు రెండూ పడిపోయాయి.

అయితే కొద్ది కాలంగా సుఖానికి అలవాటు పడిన గొర్రెలకాపరికి, ఇప్పుడు దాన్ని మొయ్యటం బరువనిపించింది. వారం తిరిగేలోగా అతను దాన్ని కటికవాళ్ళకు అమ్మి, శ్రమ తగ్గించుకున్నాడు.

బేతాళం కథని అక్కడితో ఆపి,"చూసావుగా విక్రం, దేవుడు బలహీనులతో ఎలా ఆడుకుంటాడో?! పుట్టుకతోటే కాళ్లు లేవు కదా, ఆ బక్క ప్రాణుల మొరల్ని ఆయన అంత కాలం పాటు ఎందుకు, వినలేదు? తీరా విన్నాక, రెండు గొర్రెల నడుమా అంత భేదం ఎందుకు చూపాడు? ముందుగా తనని రమ్మని పిల్చిన తెల్లగొర్రె పట్ల ఆయనకు పక్షపాత దృష్టి ఉన్నదని అనిపించట్లేదా? దేవుడనేవాడు అందర్నీ సమానంగా చూడాలి కదా, ఈ రెండు గొర్రెలూ సమానత్వానికి ఎందుకు నోచుకోలేదు మరి?! అంతా చేసి, చివరికి ఆయన సాధించిందేమిటి, ఒక గొర్రెను కటిక వానికి పంపటం మినహా?" అన్నాడు.

"అనంతమైన ఈ సృష్టిలో ప్రతి ప్రాణీ తన స్వార్థంకోసం ఏవేవో కోరికలు కోరుకుంటూనే ఉంటుంది. డబ్బు, దస్కం, సంతోషం కావాలని మనుషులు కోరుకుంటున్నట్లే, గొర్రెలు కూడా ఆరోగ్యం కావాలని కోరుకోవటంలో ఆశ్చర్యం ఏమీ లేదు. దేవుడు ప్రాణులన్నిటి వ్యక్తిగత కోరికల్నీ పట్టించుకోవాలనేమీ లేదు.

తెల్ల గొర్రెకు ఆయన వరం ఇచ్చిన రోజున, అది తన గురించి కాక, తనని మోసే యజమానికి కష్టాలు తప్పించమన్నది. ఆ ప్రవర్తన దాని ఉదాత్తతకు సూచిక కావచ్చు. దానితో పోల్చితే రెండవ గొర్రె స్వార్థ జీవి. కానీ మరి దేవుడు ఏమనుకున్నాడో? బహుశ: గొర్రెల కాపరి కష్టాల్ని తొలగించాలని అనుకొని ఉండొచ్చు. రెండవ గొర్రె స్వార్థాన్ని ఇష్టపడి ఉండకపోవచ్చు. దానికి తగినట్లుగానే ముందు గొర్రెలకు రెండింటికీ కాళ్ళు ఇవ్వటం, తర్వాత రెండవ గొర్రెను కటిక వానికి పంపటం కూడా చేసి ఉంటాడు...

ఏది ఏమైనా కోరికలు కోరేప్పుడు

మనకుగాని, ఇతరులకు గాని నష్టం చేసేవి కోరకపోవటం ఎప్పటికైనా మంచిదే. దేవుడు ఏ పనిని ఏమి ఆలోచించి చేస్తాడో, మానవులం, మనం ఏం చెప్పగలం?

అవి చూస్తే మరి గొర్రెలు, పాపం వాటికి అసలు ఇంకేం తెలుస్తుంది?" అన్నాడు విక్రం, కొంచెం అనుమానంగానే.

అట్లా అతనికి మౌనభంగం కలగగానే బేతాళం చటుక్కున పైకి ఎగిరి, మళ్లీ చెట్టెక్కింది.

**పొడుపు కథలు**

1. తలుపుల సందున మెరుపుల గిన్నె. ఏమిటా మెరిసేది?

2. తల్లి దయ్యం, పిల్ల పగడం. ఏంటా తల్లి, ఏంటా పిల్ల?

3. తెల్లకోటు తొడుక్కున్న ఎర్రముక్కు దొర. ఎవరీ దొరగారు?

4. నల్లకుక్కకు నాలుగు చెవులు. ఏంటది?!

5.తల నుండి పొగ చిమ్ముతుంది; భూతం కాదు. కన్నులెర్రగా ఉంటాయి; కానీ రాకాసి కాదు. పాకి పోతూంటుంది. కానీ పాము కాదు. ఏమిటది?!

6. ముక్కు మీదికెక్కు, ముందరి చెవులు నొక్కు, టక్కు నిక్కుల సొక్కు, జారిందంటే పుటుక్కు! ఏంటది?

7. పుట్టెడు శెనగల్లో ఒకటే రాయి.

8. పచ్చని పెట్టెలో విచ్చుకోనుంది! తెచ్చుకోబోతేను గుచ్చుకుంటుంది! ఏంటది?

9. పళ్ళున్నా నోరు లేనిది?

10. అడుగులు ఉన్నా కాళ్ళు లేనిది?

1. దీపం. 2. రేగుపండు 3. కొవ్వొత్తి 4. లవంగం 5 రైలు 6. కళ్ళజోడు 7. చందమామ 8. మొగలి పువ్వు 9. రంపం 10. గజం కొలిచే బద్ద.




# దయ్యం పట్టింది!

సైన్సు కథ

*"నీతి : మూఢనమ్మకం వద్దు, విజ్ఞానమే ముద్దు " అంటూ ఈ పాప కథ రాసి పంపింది. ఇట్లాంటి కథలు గతంలో కొత్తపల్లిలో వచ్చాయి గానీ, 'వాటిని చదవని పిల్లలకు బాగుంటుంది కదా' అని మళ్ళీ ప్రచురిస్తున్నాం.*

*రచన : కావ్యశ్రీ, 6 వ తరగతి, తేజ విద్యాలయ, కోదాడ, సూర్యపేట్ జిల్లా, తెలంగాణ.*

రాము చాలా తెలివైన పిల్లాడు. చుట్టూ జరిగే సంగతుల్ని బాగా గమనిస్తుంటాడు వాడు. అందుకనే సైన్సు సార్‌కి వాడంటే ఇష్టం.

ఒకసారి సైన్సు సార్ తరగతిలోకి రాగానే వాడు పెద్ద గొంతుతో చెప్పాడు ఉత్సాహంగా: "సార్! నిన్న నేను రాణిని చూసి వచ్చాను!" అని.

"ఓహో! ఏమైంది రాణికి?" అడిగాడు సార్.

"దయ్యం పట్టింది!"

"ఓహో! అవునా! దయ్యం బాగుందా?! అసలు ఆ పాపకు దయ్యం పట్టిందని నీకు ఎలా తెలిసింది?" అడిగాడు సార్ నవ్వుతూ.

"చూసేందుకు రాణి మామూలుగానే ఉంది- కొంచెం నీరసంగా ఉన్నట్లుంది- గానీ. వాళ్ళ

అమ్మావాళ్ళు తనని ఊరవతల ఉన్న స్వామి దగ్గరికి తీసుకెళ్ళారుట. ఆయన వాళ్లని ఒక నిమ్మకాయ తెచ్చుకొమ్మన్నాడు. మంత్రం చదివి, చాకుతో ఆ నిమ్మకాయని కోసేసరికి, అందులోంచి రక్తం చుక్కలు కారాయట!" చెప్పాడు రాము, ఉత్సాహంగా. "ఆ పాపకి దెయ్యం పట్టిందని ఆ తర్వాతనే అర్థమైంది అందరికీ!"

"ఓహో! అవునా!" అన్నాడు సర్, ఆలోచిస్తూ. "సరేలే, అయితే మరి మీరు కూడా అంతా రేపు తలా ఒక నిమ్మకాయా తెచ్చుకోండి!" అని చెప్పాడు.

"మీకు కూడా మంత్రాలు వచ్చా సర్?" "దయ్యం ఎవరికి పట్టింది సర్?" "వావ్! రేపు దయ్యాల్ని చూస్తాం!" ఇట్లా ఎవరికి తోచినట్లు వాళ్ళు ఉత్సాహంగా అరిచారు పిల్లలంతా.

మరునాడు అందరూ తలా ఒక నిమ్మకాయా తెచ్చారు. సార్ రాముని పిలిచి, వాడికి ఒక చాకునిచ్చాడు. "పలుకు! నా వెంట పలుకు- మంత్రాలు చదవాలి!" అన్నాడు సర్. "న్యూటనే, థాంసనే, రూథరే, బోరే, చంద్రశేఖరే, మేరీక్యూరే ఫట్" అని మంత్రాలు చదివారు ఇద్దరూ. "సరే, ఇప్పుడు కొయ్యి!" అన్నాడు సర్.

రాము ఆ నిమ్మకాయను కొయ్యగానే రక్తపు చుక్కలు జలజల కారాయి!

వెంటనే సారు "అమ్మో" అని రెండడుగులు వెనక్కి వేసాడు. పిల్లలంతా ఊపిరి ఎగబీక్కున్నారు. "రామూ! నీలో కూడా దయ్యం ఉంది!" అంటూ అతన్ని పక్కగా నిలబెట్టాడు సార్.



ఆ తర్వాత ప్రక్కనే ఉన్న తెల్ల స్పాంజితో చాకుని శుభ్రం చేసి, ఇంకో పిల్లాడిని పిల్చి,

మంత్రం చదివాడు- 'న్యూటనే, థాంసనే, రూథరే, బోరే, చంద్రశేఖరే, మేరీక్యూరే ఫట్' అని. "కొయ్యి ఇప్పుడు! నీ పరిస్థితి ఏంటో తెలుస్తుంది!" అంటూ. ఈ నిమ్మకాయలో నుంచి కూడా రక్తం వచ్చింది. ఈసారి పిల్లలందరూ బయటికి పరుగు పెట్టారు!

సార్ నవ్వుకుంటూ పిల్లల దగ్గరికి వెళ్ళి, "ఏం భయపడకండి! నేను ఉన్నాను. లోపలికి రండి. ఏం కాదు!" అని ధైర్యం చెప్పాడు.




పిల్లలు అందరూ నిదానంగా లోపలికి వచ్చాక, సార్ చెప్పాడు- "ఇదిగో, చూడండి. సున్నం తెల్లగా ఉంటుంది. దానికి ఎప్పుడైనా పులుపు కలిసిందనుకోండి, అది ఇట్లా ఎర్రగా మారుతుంది. నేను కత్తిని శుభ్రం చేసే పేరుతోటి ఏం చేసాను? ఈ తెల్ల స్పాంజితో రుద్దాను. ఇప్పుడు దీనికి ఏమి అంటింది? సున్నం. ఇక ఈ కత్తితో ఎవరి నిమ్మకాయని కోసినా, ఇదిగో- ఎరుపు రంగు వస్తుంది!"

"స్వామీజీలకు, బాబాలకు ఈ సంగతి తెలుసు. వాళ్ళు తమ దగ్గరున్న కత్తికి సున్నం పూసి, ఆ కత్తితో మనం తెచ్చిన నిమ్మకాయను కోస్తారు. ఎర్రగా వచ్చేది 'రక్తం' అని నమ్మిస్తారు. పాపం ఎటూ తెలియని పసి పిల్లలని, చదువు లేని పెద్దవాళ్ళను, వీళ్ళు ఇట్లా మోసం చేస్తున్నారు. రాణి లాంటి పిల్లలకు డాక్టర్ల అవసరం ఉంది- స్వాములకంటే" అంటూ అసలు రహస్యం చెప్పేసారు.

పిల్లలంతా ఎంచక్కా నవ్వుకొని, ఎవరికి వాళ్ళు నిమ్మకాయల్ని మంచి చాకు తోటీ, సున్నం పూసిన చాకు తోటీ కోసి చూసుకున్నారు. మంచి పాఠమే నేర్చుకున్నామని మురిసారు.

# మతిమరుపు

*జ్ఞాపకశక్తి బాగుండటం ఒక అదృష్టం, కదా?! అది లేకున్నా వీళ్లకి అదృష్టం తగులుకున్నదే, బలేగా?!*

*రచన : ఆసిఫ్, 9 వ తరగతి, Z.P.H.S.స్కూల్, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా.*

కొత్తపల్లిలో ఉండే కళ్యాణ్ కు మతిమరుపు. అతని భార్య బయ్యమ్మకు కూడా మతిమరుపే. వాళ్ల మతిమరుపు గురించి అందరూ కథలు కథలుగా చెప్పుకుంటారు.




ఒకసారి బయ్యమ్మకు తన మతిమరుపుతో విసుగు వచ్చేసి, "ఇగో, ఏదో ఒకటి చెయ్యప్పా, నాకు ఈ మతిమరుపుతో చానా కష్టంగా ఉంది" అంది.

"ఏం చెయ్యమంటావో చెప్పు, నాకు గుర్తుంటే చేస్తాను" అన్నాడు కల్యాణ్.

సరిగ్గా ఆ సమయానికి వాళ్ళ ఇంటి గుమ్మం ముందునుండి పోతున్నది ఒక గాడిద. "గాడిద పాలు త్రాగితే మతిమరుపు నయం అవుతుంద"ని ఎవరో చెప్పినట్లు గుర్తొచ్చింది బయ్యమ్మకు.

"నాకు గాడిద పాలు తెచ్చి పెట్టు" అంది.

"సరే" అని కల్యాణ్ గాడిద కోసం ఊరంతా తిరగటం మొదలెట్టాడు. అయితే గాడిదలన్నీ రేవు చేరాయో ఏమో, వాడికి ఒక్క గాడిద కూడా కనిపించలేదు ఊళ్ళో. చివరికి వాడు వాళ్ళ ఊరి ప్రభుత్వ ఆసుపత్రిలో నెంబరు తీసుకొని, లైన్‌లో నిలబడ్డాడు.

వాడి నెంబరు వచ్చాక డాక్టరుగారు అడిగారు- "ఏంటి, నీ సమస్య?" అని.

"నాకు ఏమీ గుర్తుండట్లేదు" అన్నాడు కల్యాణ్, కొంచెం సేపు ఆలోచించి.

"మతిమరుపు మందులు స్టైల్లె ఉండవప్పా, బలానికి ఏదైనా టానిక్ ఇమ్మంటే ఇస్తాను" అన్నాడు డాక్టరు.

"మరి గాడిద పాలు?" అనేసాడు అకస్మాత్తుగా ఆ సంగతి గుర్తొచ్చిన కల్యాణ్.

"దేవుడా! నీకు నిజంగానే మతిమరుపు మందులు కావాలి. కానీ పాలు మాత్రం ఆసుపత్రిలో అమ్మరు నాయన్నా! పోయి పొలాల్లో పనిచేసే రైతుల్ని అడుగు!" అని చెప్పి పంపాడు డాక్టరు గారు.

కల్యాణ్ మళ్ళీ మర్చిపోతానేమోనని భయం కొద్దీ "గాడిద పాలు-గాడిద పాలు" అని మంత్రం చదువుకుంటూ రైతుల దగ్గరికి పోయాడు. రైతులు నవ్వి, "పాలన్నీ ఇప్పుడు డైరీలోనేనప్పా, ఉండేది" అని వాళ్ల దగ్గరికి పంపారు.

కల్యణ్ పాలవాడి దగ్గరికి వెళ్ళి పది లీటర్ల గాడిద పాలు కావాలన్నాడు.

అప్పుడు ఆ పాలవాడు కల్యాణ్‌నే ఎగాదిగా చూస్తూ "ఇదేదో మంచి బేరమే! ఎవరైనా ఆవుపాలో, మేకపాలో అడుగుతారు. వీడికి గాడిద పాలు కావాలట!" అని అనుకొని, "అవి చాలా రేటు. లీటరు రెండొందల వరకూ ఉంటుంది!" అన్నాడు.




"సరేలే, అవేవో నాకు దొరికితే చాలు! ఒక ఐదు లీటర్లు కానివ్వు" అంటూ కల్యాణ్ వాడికి వెయ్యి రూపాయలిచ్చాడు. "ఇక్కడే వుండు, నేను పోయి తెచ్చిస్తాను నీకు!" అని చెప్పి, వాడు తనకు తెల్సిన చాకలి వాని

దగ్గరికి పోయి లీటరు గాడిద పాలు కొని, వాడికి వందరూపాయలు ఇచ్చి వచ్చాడు. "ఈ లీటరు గాడిద పాలకు నాలుగు లీటర్లు అవుపాలు కలుపుతాను" అనుకున్నాడు వాడు.




అయితే పాలని చూడగానే ఎగిరి గంతేసిన కల్యాణ్ వాడికి ఆ అవకాశం ఇవ్వనే లేదు. ఆ లీటరు పాలూ పట్టుకొని, పాలవాడికి ధన్యవాదాలు చెప్పుకుంటూ ఇల్లు చేరుకున్నాడు. తనకు అదనంగా నాలుగు లీటర్ల ఆవుపాలు మిగిలినందుకు పాలవాడు కూడా సంతోషపడి, ఊరుకున్నాడు.

అయితే ఆ సరికి బయ్యమ్మ తను గాడిద పాలు తెమ్మన్న సంగతి మరచే పోయింది. కల్యాణ్ కూడా తను తెచ్చింది గాడిద పాలు అని మరచే పోయాడు. ఇద్దరూ కలిసి ఆ పాలతో టీ పెట్టుకొని త్రాగారు!

తర్వాతి రోజున కల్యాణ్‌కి గుర్తొచ్చింది- "అవునే, నేను తెచ్చిన గాడిదపాలు ఎన్ని లీటర్లు?" అని అడిగాడు.

"ఏమోనండి, లీటరంటే ఎన్ని పాలొస్తాయో నాకెక్కడ గుర్తుంటుంది?" అన్నది బయ్యమ్మ.

అయితే కల్యాణ్ జేబులో చూసుకుంటే డబ్బులు బాగా తక్కువ కనిపించాయి. దాంతో అతను "పాలవాడి దగ్గరికే వెళ్ళి అడుగుతాను- నాకు ఎన్ని పాలు ఇచ్చాడో, ఎంతకి ఇచ్చాడో" అని ఊళ్ళోకి బయలు దేరాడు.

పట్టుదలగా తనవైపుకే వస్తున్న కల్యాణ్‌ని దూరం నుండే చూసాడు పాలవాడు. 'అంతకు ముందు రోజు తను వాడిని మోసం చేసినందుకు ఏమంటాడో' అని

అతను హడలిపోయాడు. అయితే అతని ఆలోచన తెగేలోగా కల్యాణ్ అతని దగ్గరికి రానే వచ్చాడు.

"అవునూ," అని మొదలు పెట్టాడుగానీ, ఆ తర్వాత తను ఎందుకొచ్చాడో మరచిపోయాడు కల్యాణ్.




"నిన్న నువ్వు ఇచ్చిన డబ్బుల గురించి కదా, ఇదిగో- దీన్ని నేను నాకోసం కొనుక్కున్నాను, కానీ నువ్వు అడిగావని ఇచ్చేస్తున్నాను. ఇది ఇక నీదే.. పూర్తిగా నీదే. ఇవాళ్ల సాయంత్రమే దీని డ్రా తీస్తారు.. ఎంత బహుమతి వచ్చినా అది నీకే!" అని తను అంతకు ముందు కొన్న ఓ లాటరీ టిక్కెట్టును కల్యాణ్ చేతిలో పెట్టాడు పాలవాడు.

కల్యాణ్ ఏదో గుర్తుకొచ్చినట్లు అనబోతుంటే అతను అటూ ఇటూ చూసి, అక్కడే ఓ టబ్బు దగ్గర తిరుగుతున్న తాబేలును ఒకదాన్ని తీసి కల్యాణ్ చేతిలో పెట్టి, "ఇదిగో! ఈ తాబేలు కూడా నీకే! తీసుకో! మన లెక్క దీంతో సరిపోయింది!" అని చెబుతూ గబగబా లేచి వెళ్ళిపోయాడు, గట్టిగా ఊపిరి పీల్చుకుంటూ.

ఆ లాటరీ టిక్కెట్టును, తాబేలును పట్టుకొని సంతోషంగా ఇంటికొచ్చాడు కల్యాణ్. "చూడు! ఇవాళ్ళే డ్రా తీస్తారట! ఈ తాబేలునేమో.. మరి.. ఎందుకిచ్చాడో మర్చిపోయాను- ఏదో చెప్పి ఇచ్చాడు నాకు" అన్నాడు, బయ్యమ్మతో.

రంగు రంగుల ఆ టిక్కెట్టుని చూసి మురిసిపోయింది బయ్యమ్మ. అయితే ఆ రోజు సాయంత్రం లాటరీలో మొదటి బహుమతి కోటి రూపాయలు కల్యాణ్ చేతిలో ఉన్న టిక్కెట్టుకే వచ్చాయి!

ఆ డబ్బుల చెక్కుని అందుకుంటూ కల్యాణ్ "నాకు ఈ టిక్కెట్టు కొనిపెట్టిన నా భార్యకు కృతజ్ఞతలు!" అని చెబుతుంటే, అక్కడే ఉన్న

పాలవాడు వీళ్ల మతిమరుపును తలచుకొని స్పృహ తప్పి పడిపోయాడు!

బహుమతిని అందుకుంటూ మురిసిపోతున్న కల్యాణ్ వీడియోని లాటరీ వాళ్ళు ఇంటర్నెట్లో పెట్టారు. ఆ వీడియోలో అటూ ఇటూ తిరుగుతూన్న తాబేలుని చూసి, జూ అధికారి ఒకడు గుర్తుపట్టాడు- అది చాలా అరుదైన రకం తాబేలు! అతను చెప్పటంతో కదిలిన అధికార యంత్రాంగం కల్యాణ్‌ని అడిగింది- "ఇది మీకు ఎక్కడ దొరికింది?" అని. "ఏమో, గుర్తులేదు. పాల దుకాణం దగ్గర కాబోలు, దొరికింది" అన్నాడు కల్యాణ్. "దీన్ని మా జూకు ఇవ్వరాదూ? మీకో చక్కని బహుమతి ఇస్తాం" అని వాళ్ళు తాబేలుని తీసుకెళ్ళి, వీళ్లకు పదివేల రూపాయల బహుమతినిచ్చారు!

అట్లా ధనవంతులైన కల్యాణ్, బయ్యమ్మ పట్నంలో మంచి ఆస్పత్రికెళ్ళి. తమ మతిమరుపును బాగు చేయించుకున్నారు.

నవ్వండి!

**కొత్త మోజు!**

భార్య: అదేంటండీ! కొత్త బండిని అలా తోసుకుంటూ వస్తున్నారు?

భర్త: కొత్త బండి కదా, పెట్రోలు ఎంత తాగుతుందో తెలీదు, అందుకని!

**ఇంకెవ్వరూ రారండి!**

టీచర్: రాము! ఈ తరగతి మొత్తంలో టైం ప్రకారం నడుచుకునే వారెవరు,చెప్పు?

రాము: గడియారం టీచర్!

**సత్యవాది!**

రమణ: మీ కొత్త ఫ్రిజ్ ఎలా పని చేస్తుంది?

రాము: కరెంటుతోనేనండి!

**కలలు మంచివి!**

లత: ఇప్పుడే నాకు ఒక కల వచ్చిందండి- మీరు నాకు రత్నాల హారం కొన్నట్టు.

సురేష్: ఓహో. అయితే వెంటనే మళ్ళీ కలగను- ఈసారి నేను దాన్ని నీ మెడలో వేసినట్లు.



# తీరిన కష్టం

*రచన: ఎమ్.తరుణ్, 8 వ తరగతి, అరవిందా స్కూల్, కుంచన పల్లి, గుంటూరు జిల్లా*

ఒక ఊరిలో ఇద్దరు స్నేహితులు ఉన్నారు. ఒకడి పేరు తరుణ్, మరొకడి పేరు బాలాజీ. వాళ్ళిద్దరూ మంచి స్నేహితులు. ఇద్దరూ ఒకే బడిలో ఎనిమిదో తరగతి చదువుతున్నారు.



ఆ సంవత్సరం వాళ్ల తరగతికి కొత్తగా రాజు అనే పిల్లవాడు వచ్చి చేరాడు. వాడొక గొప్ప 'యాక్టర్' అనచ్చు. వాడు వీళ్లతోటి ఒక మంచి స్నేహితుడిలాగా నటిస్తూనే, ఇద్దరి దగ్గరా దొంగతనాలు చేయసాగాడు.

అనుమానపడ్డ తరుణ్‌కు బాలాజీ మీద, బాలాజీకి తరుణ్ మీద చాడీలు చెప్పాడు.

వాడు చెప్పింది నిజం అనుకొని, వాళ్ళిద్దరూ ఒకరికొకరు దూరమైనారు. కనీసం మాట్లాడుకోవటం కూడా మానేసారు.

అయితే ఒక రోజున రాజు వాళ్ళ ఇంటికి వెళ్ళిన తరుణ్‌కు అక్కడ బాలాజీ పుస్తకాలు, వస్తువులు కనిపించాయి. వేరేవాళ్ళు పోగొట్టుకున్న వస్తువులు కూడా కొన్ని కొన్ని కనిపించాయి. సరిగ్గా అదే సమయానికి బాలాజీకేమో తరుణ్ వస్తువులు కనబడ్డాయి!



దాంతో బాలాజీ, తరుణ్ మళ్ళీ మంచి స్నేహితులైపోయారు. ఇద్దరూ కలిసి రాజు గురించి హెడ్ మాస్టర్ గారికి చెప్పారు.

హెడ్మాస్టరుగారు రాజు వాళ్ల అమ్మ-నాన్నలను పిలిపించి మాట్లాడారు. తన బండారం బయట పడ్డందుకు రాజు సిగ్గుతో తల వంచుకున్నాడు. అయితే 'ఇకమీద నేను మంచిగా ఉంటాను' అని రాజునుండి మాట తీసుకున్నారు హెడ్మాస్టరు గారు. వాడి పేరు బయట పడకుండానే బడిలో పిల్లలకందరికీ వాళ్ల వాళ్ల సామానులు తిరిగి ఇప్పించారు.

## వేడెక్కించే వార్త!



పిసినారి పుల్లయ్య : బాగా జలుబు చేసిందే! వేడివేడిగా ఏమైనా ఉంటే చెప్పు!

భార్య: ఇప్పుడే షాపింగ్ చేసొచ్చానండి; బిల్లు లక్ష అయింది! ఈ సంగతి మీకెలా చెప్పాలా అని చూస్తుంటే మీరే అడిగారు!



# కోడి పుంజు

ఒక్క పేజీ కథ

అనగనగా ఒక కోడిపుంజు ఉండేది. అది ఉత్త సోకులాడి. సోకులన్నా, బంగారం అన్నా దానికి చాలా ఇష్టం.

ఒకరోజు సాయంత్రం అది గింజలు వెతుక్కొని తింటూ తింటూ చాలా దూరం పోయింది.

అకస్మాత్తుగా దానికి ఒక బంగారు గింజ కనిపించింది బాట ప్రక్కనే, మెరుస్తూ.

"ఎంత బాగుందో!" అనుకుంటూ కోడి అటూ ఇటూ చూసింది. ఆ దగ్గర్లో వేరే ఎవ్వరూ లేరు.

చకచకా వెళ్ళి దాన్ని ముక్కున కరచుకోబోయింది. ఎన్ని సార్లు పట్టుకున్నా, అది నోటికి చిక్కినట్లే చిక్కి, క్రిందికి జారిపోసాగింది.

కోడి దాన్ని వొడిసి పట్టుకునేందుకు ప్రయత్నిస్తూ ప్రయత్నిస్తూ గుండ్రాలు గుండ్రాలుగా తిరిగింది.

అది ఎంత గట్టిగా ప్రయత్నిస్తే ఆ గింజ అంత దూరం ఎగిరి పడసాగింది. కోడి దాని వెంట పరుగెత్తింది.

అట్లా కొద్ది సేపటికి చూస్తే కోడిపుంజుకు తను ఎక్కడున్నదో అర్థమే కాలేదు. అంతలోనే చీకటి పడసాగింది.

చివరికి ఆ చీకట్లో ఆ బంగారు గింజ ఏమైందో, కనిపించనే లేదు!

తడుముకుంటూ తడుముకుంటూ పోతే ఎంత దూరం పోయినా అడవి వచ్చింది తప్ప, దాని ఇల్లు రానే లేదు.

చివరికి అది భయపడి, ఓ చెట్టెక్కి కూర్చొని, రాత్రంతా జాగరణ చేసింది.

"బంగారు గింజ ఎంత పని చేసింది! దీని కంటే ఒక మామూలు గింజ దొరికి ఉంటే ఎంత బాగుండేది, కడుపన్నా నిండేది కదా!" అనుకుంది బుద్ధి తెచ్చుకున్న కోడిపుంజు, తూరుపు తెలవారుతుండగా.



# బయట పడ్డ మోసం

*రచన: గణేష్, నవీన్‌కుమార్, 8 వ తరగతి, మోడల్ స్కూల్, చెన్నేకొత్తపల్లి.*

అనగనగా ఒక ఊళ్లో రామయ్య-సోమయ్య అనే ఇద్దరు వ్యాపారులు ఉండేవాళ్ళు. ఇద్దరూ తమ ప్రాంతంలో పండిన ధాన్యాలను కొనుగోలు చేసి, దూర ప్రాంతాల్లో మంచి ధరకు అమ్మేవాళ్ళు. ఇట్లాంటి వ్యాపారాలు ఒంటరిగా చేయటం కష్టం అన్న ఉద్దేశంతో, ఏ పని చేసినా ఇద్దరూ కలిసి చేసి, లాభాల్ని సమానంగా పంచుకుంటూ ఉండేవాళ్ళు.

ఒక సంవత్సరం అలా అన్నీ సిద్ధం చేసుకున్నాక, అకస్మాత్తుగా రామయ్య ఆరోగ్యం పాడైంది. "నేను కదిలే పరిస్థితి లేదు సోమయ్యా! ఈసారికి నువ్వు ఒక్కడివే వెళ్ళిరా! నా వంతు ధాన్యం నేను ఇక్కడే ఎక్కడైనా అమ్ముకుంటాను" అన్నాడతను. అయితే సోమయ్య ఒప్పుకోలేదు. "దానిదేముంది, నీ వంతు కూడా నేనే తీసుకెళ్ళి అమ్ముకొస్తాను!" అన్నాడు.

'సరే- అదే మేలు' అని మిత్రుడికే తన వంతు

ధాన్యం కూడా అప్పగించి పంపాడు రామయ్య.

ఆ సంవత్సరం సోమయ్యకు వ్యాపారం అద్భుతంగా జరిగింది. చాలా డబ్బు చేతికొచ్చింది. అంత డబ్బును కళ్ళ చూసేసరికి సోమయ్యకు ఎక్కడా లేనంత ఆశ పుట్టింది. ఆ డబ్బులో సగం రామయ్యకు యివ్వడానికి అతని మనసు అస్సలు ఒప్పలేదు.



దాంతో అతను తను సంపాదించుకొచ్చిన డబ్బులో అధికశాతాన్ని సముద్రం ఒడ్డునే ఇసుకలో దాచి, ఊరికే కొంత సొమ్మును మాత్రం తీసుకువచ్చి, దొంగ ఏడుపులు ఏడుస్తూ "రామయ్యా! ఏం చెప్పేది?! ఒక్కడినే రావటం చూసుకొని ఆ దేశపు ప్రజలు నన్ను పూర్తిగా మోసం చేసారు. అసలు నీ ధాన్యాన్నయితే వాళ్ళు పూర్తిగా దొంగిలించుకొనే పోయారు. మిగితాది మటుకు నేను కాపాడుకున్నాను. అయినా దాన్ని అమ్ముదామంటే కూడా సరైన రేటు రాలేదు. చివరికి చూసుకుంటే మొత్తంగా వచ్చిన డబ్బు ఇదిగో, ఈ పది వేల రూపాయలు! నీ ఆరోగ్యం బాలేనందుకు గాను ఎంత నష్టపోయామో చూడు" అంటూ తన చేతిలో మూట చూపించాడు.

"పోనీలే సోమయ్యా! ఏం చేస్తాం?! నా రాత ఇట్లా ఉంది!" అన్నాడు రామయ్య.

"కాదు కాదు- ఎంత వచ్చినా నీ వాటా నీది కాకుండా పోతుందా? ఇందులో సగం నీది. అమ్మి పెట్టిన ఖర్చులకు నువ్వు ఏమీ ఇవ్వనక్కర్లేదులే" అంటూ ఐదువేల రూపాయలు రామయ్య చేతిలో పెట్టి, వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు సోమయ్య.

రామయ్యకు అతని మోసం అర్థమైంది. కానీ తను ఏం చేయగలడు? "నా ఆరోగ్య సమస్య వల్లనే ఇట్లా జరిగింది" అనుకొని చప్పుడు చేయకుండా ఊరుకున్నాడు.

కానీ మాట దాగదు గదా, 'రామయ్యకు-సోమయ్యకు పాపం, వ్యాపారం బాగా సాగలేద'ని, 'పొరుగుదేశాల్లో రేట్లు బాగా రాలేద'ని అందరూ చెప్పుకున్నారు.

అయితే అంత డబ్బు వచ్చిన ఆనందం త్వరలోనే సోమయ్యను ముంచెత్తింది. అతను ఇప్పుడు బాగా ఖర్చు పెట్టి ఇల్లు పెద్దది చేయించుకోవటమే కాకుండా, తన భార్యకు, కుమారుడికి బంగారం కూడా చేయించాడు.

అది చూసిన వాళ్ళంతా "నష్టం వచ్చిందన్నారు, మరి ఇదేంటి?" అని గుసగుసలు పోయారు. కొందరు చొరవ చేసి రామయ్యతో ఆ మాట అన్నారు కూడా. "ఈసారి నేను పోలేదు కదా, అంతా సోమయ్యే చూసాడు; పాపం నష్టం వచ్చిందట నిజంగానే!" అన్నాడు రామయ్య.



సరిగ్గా అదే సమయానికి రాజ మందిరంలోని విలువైన వస్తువులు కొన్ని కనిపించడం లేదని కనుక్కున్నారు. "దొంగలకు కఠిన శిక్షలు విధిస్తాం. కోరి వాటిని కొన్నవాళ్లకు కూడా ఇదే చివరి అవకాశం: మర్యాదగా మాకు తెచ్చి ఇస్తే సరి, లేకుంటే ఉరిశిక్ష పడుతుంది. దొంగలను పట్టించిన వారికి బహుమానం ఇవ్వబడుతుంది" అని దండోరా వేయించారు రాజుగారు.

"సోమయ్యకు వ్యాపారంలో నష్టం వచ్చినా, బంగారం కొన్నాడంటే మరి, ఇలాంటి దొంగ పనేదో చేసి ఉంటాడు" అనుకున్న ఊళ్ళోవాళ్ళు రాజుగారి చెవిలో ఆ సంగతి ఊదారు: "అంత తక్కువ సమయంలో

సోమయ్య కోటీశ్వరుడు అయ్యాడు ప్రభూ! మాకు అనుమానంగా ఉంది" అని.

వెంటనే రాజుగారు సోమయ్యను పిలిపించి "నువ్వు ఇంత తక్కువ సమయంలో కోటీశ్వరుడివి ఎలా అయ్యావు?" అని అడిగాడు.

"పొరుగుదేశాల్లో వ్యాపారం చేసి లాభం సంపాదించాను ప్రభూ!" అన్నాడు సోమయ్య.

రాజుగారు రామయ్యను పిలిపించి, "ఏమిరా! నువ్వేమో నష్టం వచ్చింది అంటున్నావు, వీడు లాభం వచ్చిందంటున్నాడు?! మర్యాదగా నిజం చెప్పండి- లేకపోతే ఇద్దరికీ ఉరిశిక్ష వేయిస్తాను" అని గద్దించాడు.

సంగతిని ఇంక దాచలేని సోమయ్య వాస్తవం బయట పెట్టాడు. "నేను రామయ్యని మోసం చేశాను" అని.

రాజు గట్టిగా నవ్వి, "ఒరే! 'తీగలాగితే డొంక కదలటం' అంటే ఇదే. నువ్వు నిన్ను నమ్మిన స్నేహితుడినే మోసం చేసినవాడివి. నిన్ను ఇంక ఎవరు నమ్ముతారు? సరే, నీకు శిక్ష నువ్వే విధించుకో, చూస్తాను" అన్నాడు.



సోమయ్య వణికిపోతూ రాజుగారి పాదాలు పట్టుకొని, "నాకు వచ్చిన లాభం కూడా కలిపి మొత్తం అంతా రామయ్యకు ఇచ్చేస్తాను. సముద్రం ఒడ్డున దాచిన సొమ్ము కూడా తీసి ఇచ్చేస్తాను. నన్ను క్షమించండి" అని ప్రాధేయపడ్డాడు.

"నాకు న్యాయంగా రావలసిన సొమ్ము ఇస్తే చాలు మహారాజా, మిగతాది తమరు రాజ్యానికి జమ చేసుకోండి" అని తన వంతు లాభాన్ని తీసుకొని, మిగతాది ఖజానాకు జమ చేసాడు రామయ్య.



# మార్పు

రెండు పేజీల కథ

*రచన: రాఘవి, 8 వ తరగతి, అరవిందా స్కూల్, కుంచనపల్లి, గుంటూరు జిల్లా.*

చంద్రిక చాలా బాగా చదువుతుంది; చక్కగా ఆటలు ఆడుతుంది. సంగీతం, నాట్యం నేర్చుకుంటున్నది; అంతే కాకుండా బొమ్మలు కూడా బాగా గీస్తుంది. తన దస్తూరీ ముత్యాల-లాగా ఉంటుంది.

తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు తనని బాగా ప్రోత్సహించేవాళ్ళు. సందర్భానుసారంగా ఏది మంచి-ఏది చెడు అని చెప్పేవాళ్ళు. చంద్రికకు మొదట్లో వాళ్లు చెప్పే మంచి సంగతులు నచ్చేవి. అయితే తను పెద్దవుతున్నకొద్దీ "వీళ్ళెందుకు, ఇట్లా అన్ని సంగతుల్లోనూ చెయ్యి పెడతారు? నేను ఏం చెయ్యాలో, చెయ్యకూడదో అన్నీ ఈ పెద్దవాళ్ల ఇష్టమేనా? నా ఇష్టం వచ్చినట్లు నేను ఉంటాను!" అనుకోవటం మొదలు పెట్టింది.

పదో తరగతిలో తనకు చాలా మంచి మార్కులు వచ్చాయి. వాళ్ల అమ్మానాన్నలు ఆ పాపని "నువ్వు ఇప్పుడు ఏం చదువుతావు?" అని అడిగారు. "డాక్టరును అవుతాను" అంది చంద్రిక. అందుకని వాళ్ళు అమ్మ, నాన్న చంద్రికను వాళ్ల ఊరికి దూరంగా, ఎంట్రన్సు పరీక్ష కోసం కోచింగ్ ఇచ్చే కాలేజి హాస్టల్లో చేర్చారు.

హాస్టల్‌లో చంద్రికతో పాటు ఉండే అమ్మాయి చాలా బద్ధకిస్టు. అస్సలు చదవదు: ఎప్పుడూ దొంగతనంగా సెల్‌ఫోన్ చూస్తూనే ఉంటుంది; ఏవో ముచ్చట్లని, పార్టీలని తిరుగుతూనే ఉంటుంది; ఎప్పుడూ చంద్రికను కదిలిస్తూనే ఉంటుంది. అంతేకాక, ఇప్పుడు చంద్రికను శాసించే వాళ్ళు కూడా ఎవ్వరూ లేరు! దాంతో మామూలుగా చాలా పద్ధతిగా ఉండే చంద్రిక కూడా, కొన్ని రోజులకి ఆ పాపతో చెయ్యి కలిపింది: "నాకు ఇదే యిష్టం!" అనుకున్నది.



ఆ సంవత్సరం చదువులో మెల్లగా వెనక పడుతూ పోయింది చంద్రిక. ఆ సంగతి తను గుర్తించినా, 'కాలేజి బాగా లేదు- టీచర్లు బాగా చెప్పట్లేదు' అనుకున్నది తప్పిస్తే, 'నా పద్ధతులు తప్పు' అనుకోలేదు ఆ అమ్మాయి. అలా వెనకపడి, వెనకపడి చివరికి మొదటి సంవత్సరం పరీక్షల్లో తప్పింది!

చంద్రిక వాళ్ల అమ్మ, నాన్న బాధపడ్డారు; కానీ చంద్రికను వాళ్ళు ఏమీ అనలేదు. "మెడికల్ సీటు రాకపోయినా ఏమీ పర్లేదమ్మా! మామూలు కాలేజీలో బీయస్సీలో చేరచ్చు" అన్నారు. అయినా చంద్రిక మటుకు చాలానే చిన్నబోయింది: 'ఎందుకు ఇట్లా అయ్యాను? నాలో ఏమి మార్పు వచ్చింది?' అని ఆలోచించుకున్నది. చిన్నప్పుడు తమ ఇంట్లోవాళ్ళు, బడిలో ఉపాధ్యాయులు తనకు ఏమేం చెప్పారు, తను ఎలా చదివేది, అన్నీ గుర్తు చేసుకున్నది; ఇప్పుడు తన సమయాన్ని వృథా చేసే అలవాట్లను అన్నిటినీ గుర్తించి, దూరం చేసుకున్నది. పట్టుదలగా చదవడం మొదలుపెట్టింది. త్వరలోనే అన్ని సబ్జక్టులలోనూ చక్కని మార్కులతో పాస్ అయ్యింది. సంవత్సరాంతంలో 'నీట్' పరీక్ష కూడా చాలా చక్కగా రాసి మెడిసిన్ లో సీటు తెచ్చుకోవటమే కాదు; అక్కడ కూడా బాగా చదివి మంచి వైద్యురాలు అయ్యింది!

మన అలవాట్లు బాగుంటే చాలు, మనం అనుకున్నవి ఏమైనా సాధించగలం.



# పక్షి మహిమ

*రచన: హారిణి, 8 వ తరగతి, తేజా విద్యాలయ, కోదాడ.*

అక్షయ్ తల్లిదండ్రులు వ్యవసాయదారులు. పెద్దగా చదువుకున్నవాళ్ళు కాదు. "చదువు రాకపోవటం వల్ల మేము చాలా నష్టపోయాం" అన్న భావనతో వాళ్ళు అక్షయ్‌ని బడికి పంపించేవాళ్ళు.

"మంచిగా, బుద్ధిగా చదువుకోరా నాయనా! చదువే మనకు బువ్వ పెడుతుంది. ఈ పొలంలో మిగిలేది లేదు" అని వాళ్ళు అక్షయ్‌ని పొలం పనుల్లో పెట్టకుండా, దూరంగా ఉన్న ప్రైవేటు బడిలో చేర్పించారు.

అక్షయ్ తెలివైన వాడే, కానీ వాడికి చదువంటే ఇష్టముండేది కాదు. అయినా బలవంతంగా బడికి పంపించేవారు తల్లిదండ్రులు. కొద్ది రోజులు ఇట్లా గడిచేసరికి, వాడు బడి ఎగగొట్టటం నేర్చుకున్నాడు. బడికి వెళ్లినట్టుగానే వెళ్లి ఊరంతా తిరిగొచ్చేవాడు. ఇట్లా రెండు నెలలు అయ్యే సరికి, తల్లిదండ్రులకు పిలుపు వచ్చింది.

ఉపాధ్యాయులు వాళ్లను కూర్చోబెట్టి, అటెండెన్సు రిజిస్టరు చూపించి, అక్షయ్ ఎన్ని రోజులు రాలేదో వివరించారు.

దాంతో పరిస్థితి స్పష్టమైంది: "అక్షయ్ బడికి వెళ్ళడం లేదు, అమ్మానాన్నలను మోసం చేస్తున్నాడు" అని అందరికీ తెలిసిపోయింది.



ఇక ఆరోజు నుండి అందరూ వాడిని 'నువ్వు బడి దొంగవి, మొద్దువి' అని ఎగతాళి చేయటం మొదలు పెట్టారు. ప్రతి ఒక్కరూ తనని అట్లాగే అంటూండే సరికి అక్షయ్ చిన్నబోయాడు.

సరిగ్గా ఆ సమయానికి చంద్రం మామయ్య వచ్చాడు వాళ్ళింటికి. చంద్రం పట్నంలో పరీక్షలకోసం చదువుతుంటాడు. అక్షయ్‌కి అతనంటే చాలా ఇష్టం. "వీడికి కొంచెం బుద్ధి చెప్పురా!" అని తల్లిదండ్రులు చంద్రానికి పురమాయించారు. చంద్రం సరేనన్నాడు గాని, ఏమి చేస్తే వీడు బాగుపడతాడో అతనికీ అర్థం కాలేదు.

ఆ రోజున కూడా అక్షయ్ బడి ఎగగొట్టి, ఊరి చివరన చెట్టుకింద కూర్చొని ఉండగా, వాడికి చిట్టి పిట్ట ఒకటి కనబడింది. అది గూడు తయారు చేసుకుంటున్నది. ఎగురుకుంటూ పోయి, ఎక్కడినుండో ఒక రకమైన పుల్లల్ని ముక్కున కరచుకొని తెస్తున్నది. వాటిని ఒక పద్ధతిగా అమర్చి, మళ్ళీ ఎగిరి పోతున్నది. ఒకసారి అది అట్లా ఎగిరి పోగానే అక్షయ్ ఆ గూడు దగ్గరకు వెళ్ళి చూసాడు. మెల్లగా ఆ గూడుని అక్కడినుండి తీసేసి, దూరంగా పడేసి, ఏమీ ఎరగనట్లు వచ్చి కూర్చున్నాడు.

పిట్ట వచ్చి, తను తయారు చేసిన గూడు కోసం వెతుక్కున్నది. గూడు అక్కడ లేకపోయే సరికి కంగారుపడ్డది. అటూ ఇటూ ఎగిరి, 'వీడు ఏమైనా తీసుకున్నాడా'

అన్నట్టు చూసింది. అక్షయ్ కదలకుండా అట్లాగే కూర్చున్నాడు. అది ఏమనుకున్నదో, ఏమో- మళ్ళీ కొత్తగా గూడు కట్టటం మొదలు పెట్టింది. ఒక్కొక్క పుల్లా తీసుకొచ్చి కూర్చింది. అక్షయ్ కళ్ళముందరే కొత్త గూడు తయారైంది.

గమనిస్తూ కూర్చున్న అక్షయ్ మనసులో ఆలోచనలు తిరిగాయి.. "అరే! అంత చిన్న పక్షికూడా, చూడు, ఎట్లా శ్రమ పడుతున్నదో! దానికి అసలు ఏ సదుపాయమూ లేదు. తల్లిదండ్రులూ లేరు, ఇల్లూ వాకిలి కూడా లేవు. అయినా అంత కష్టపడి, తన భవిష్యత్తు కోసం, తనే సొంతంగా గూడు కట్టుకుంటున్నది. మధ్యలో నాలాంటి వాళ్ళు దాన్ని తీసేస్తే కూడా, ఆ పనిని మానెయ్యటంలేదు. ఓపికగా మళ్ళీ తన పనిని తను కొనసాగిస్తున్నది.. మరి నేను? నేను ఏం చేస్తున్నాను?" అనిపించింది.

ఆ రోజున చంద్రం మామయ్య వాడితో చదువుల గురించి ఏమీ అనలేదు. కాసేపు పిచ్చాపాటీగా మాట్లాడి వెళ్ళిపోయాడు.



అయితే ఆ తర్వాత అక్షయ్ కొత్త పిల్లవాడై-పోయాడు. తనంత తాను బడికి వెళ్లటమే కాదు. తరగతిలో ఫస్టు వచ్చేట్లు శ్రమపడి చదివాడు.

వాడిలో వచ్చిన మార్పుని చూసి అంతా 'మామయ్య మహిమ' అనుకున్నారు. కానీ అక్షయ్‌కి మాత్రం నిజం తెలుసు- అదంతా 'పక్షి' మహిమే!

**జాలిగుండె!**

రవి: మమ్మీ! బయట ఒకాయన ఎండలో నిల్చునీ అరుస్తుంటే, ఇందాక పది రూపాయలు ఇచ్చాను..

అమ్మ: మంచిపని చేశావ్.. ఇంతకీ ఏమని అరిచాడు అతను ?!



రవి: ఐస్క్రీం.. ఐస్క్రీం. ఐస్క్రీం..అని.



# పేను-పెసర చేను

*మూలం : శ్రీ నార్ల చిరంజీవి.*

*సేకరణ, కథనం : మహి, 4 వ తరగతి, ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల, సికే పల్లి, అనంతపురం జిల్లా*



అనగనగా ఒక పేను ఉండేది. దానికి ఒక పెసర చేను ఉండేది. రోజూ అది దర్జాగా కాలు మీద కాలు వేసుకొని కూర్చొని, పెసర చేనుకు కాపలా కాసేది. విరగకాసిన చేనును చూసుకుంటూ ఆనందంగా పాటలు పాడుకునేది.

ఒకసారి ఆ ఊరి రాజు అటుగా వచ్చాడు. అతను, అతని సైన్యమూ పెసర చేనును చిత్తడి చిత్తడిగా తొక్కేశారు. తన చేను నాశనం అవ్వటం చూసి పేను చాలా ఏడ్చింది. రాజుకు ఎలాగైనా బుద్ధి చెప్పాలనుకున్నది.

మిగిలిన పెసర కాయల్ని కోసి, రుబ్బి, అది చాలా రుచికరమైన పెసరట్లు వేసింది. ఆ పెసరట్లు మూట గట్టుకొని రాజు దగ్గరికి

బయలుదేరింది.

అన్నేసి పెసరట్లు కమ్మగా 'ఘుమ ఘుమలాడుతుంటే, ఆ వాసనకు నోరూరిన సింహం ఒకటి పేను దగ్గరకు వచ్చి "నేను కూడా నీతోటి వస్తాను. నీకు ఏ సాయం కావాలంటే ఆ సాయం చేస్తాను- పెసరట్లు నాకు కొన్ని పెట్టవా!" అని అడిగింది. "సరే" అని పేను దానికి పెసరట్లు పెట్టింది.

ఆ తరువాత అవి రెండూ కలిసి పోతూ ఉంటే, ఈసారి వాటికొక పాము ఎదురైంది. పెసరట్ల వాసన దానికి కూడా చాలా నచ్చి, అది కూడా సింహం అడిగినట్లే అడిగింది. "సరే" అని పేను పాముకు కూడా పెసరట్లు పెట్టింది.

అప్పుడింక ఆ మూడూ కలిసి పోతావుంటే ఈసారి వాటికొక తేలు ఎదురైంది: "నేను కూడా నీకు సాయం చేస్తాను. నాకు పెసరట్లు పెట్టవా ప్లీజ్" అని అడిగింది అది కూడా. పేను దానికి కూడా పెసరట్లు పెట్టింది.

నాలుగూ కలిసి ముందుకు పోతుంటే వాటికొక సీతాకోక చిలుక ఒకటి ఎదురైంది. అది కూడా అన్నీ అడిగిన మాదిరే అడిగింది. పేను దానికి కూడా పెసరట్లు పెట్టి, తమవెంట పిలుచుకు పోయింది.

అట్లా అన్నీ కలసి రాజుగారి భవనం చేరుకున్నాయి. అక్కడ కాపలా ఉండే వాళ్లంతా సింహాన్ని చూసి పారిపోయారు. దాంతో అవన్నీ నేరుగా రాజు పడుకునే గది దగ్గరికి పోయాయి.



సీతాకోక చిలుక లోపలికి ఎవ్వరూ రాకుండా కాపలా కాయసాగింది. పాము చప్పుడు కాకుండా ఆ గది తలుపు తీసి, గడియకు చుట్టుకున్నది. లోపల రాజు గురక పెట్టి నిద్రపోతున్నాడు. ప్రక్కనే దీపం వెలుగుతున్నది. సింహం మెల్లగా పోయి

దీపం ప్రక్కన నిలబడింది. రాజు ప్రక్కనే ఉన్న గూట్లోకి చేరుకున్నది తేలు. పేను మెల్లగా రాజుగారి గడ్డంలోకి దూరి ఇష్టం వచ్చినట్లు కొరకటం మొదలు పెట్టింది.

హాయిగా నిద్రపోతున్న రాజుకు నిద్రాభంగం అయింది. ఎంత గోక్కున్నా దురద పోలేదు. చివరికి చికాకుగా లేచి కూర్చున్నాడు. అయినా పేను తన దారిన తాను కొరుకుతూనే పోయింది.

"దువ్వుకుంటే సరిపోతుంది" అని దువ్వెన కోసం గూట్లో చెయ్యి పెట్టాడు రాజు. అక్కడే కూర్చున్న తేలు చటుక్కున కుట్టింది. "అబ్బా!" అని అరుస్తూ రాజు వేలిపైన గాటును చూసుకుందామని దీపం దగ్గరకు పరుగెత్తాడు. దీపం ప్రక్కనే కూర్చున్న సింహం గాండ్రించింది. రాజు గాభరాగా గదిలోంచి బయటికి పారి పోదామని తలుపు దగ్గరికి పరుగెత్తబోయాడు. గడియకు చుట్టుకున్న పాము బుస్సుమన్నది. ఇంక ఏం చేయాలో తెలీని రాజు చెమటలు క్రక్కుకుంటూ నిలబడి పోయాడు.

ఆలోగా సీతాకోక చిలుక మీదికి ఎక్కి కూర్చున్న పేను కోపంగా లేచి నిలబడింది: "ఏమి రాజా?! ఒక్క పూట నిద్ర చెడితేనే అంత బాధ పడుతున్నావు; మరి నా చేను మీదినుండి సైన్యాన్ని పంపినప్పుడు నాకెంత బాధ వెయ్యాలి? చిన్న ప్రాణులంటే నీకు అంత అలుసా?" అని అడిగింది గట్టిగా.

రాజు ముందు బిత్తరపోయాడు. అటుపైన పేనుకు క్షమాపణ చెప్పుకున్నాడు. "ఇకపైన ఎప్పుడూ చిన్న ప్రాణులను హింసించను" అని వాటికి మాట ఇచ్చాడు.

సంతోషపడ్డ పేను తన సైన్యంతో సహా వెనుదిరిగి ఇంటికి పోయింది.

కాని వాని తోటి కలసి వర్తించెనా
హాని వచ్చు నెంత వానికైన
తాటి క్రింద పాలు తాగిన చందమౌ
విశ్వదాభిరామ, వినురవేమ!

భావం: ఓ వేమా! తాటి చెట్టుకింద కుర్చొని పాలు త్రాగుతున్నా, 'కల్లు త్రాగుతున్నాడ'నే అనుకొంటారు. అదే విధంగా చెడ్డవారితో కలిసి తిరుగుతూ ఉంటే ఎంత మంచివానికైనా చెడ్డ పేరు వస్తుంది.



# పిసినారి పాపయ్య

రెండుపేజీల కథ

*రచన: శివశంకర్, ఏడవతరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, సికే పల్లి, అనంతపురం జిల్లా*

పిసినారి పాపయ్య ఎప్పుడూ ఒక్క రూపాయి ఖర్చు పెట్టేవాడు కాదు; తీసుకున్న అప్పు తిరిగి ఇచ్చేవాడూ కాదు. కానీ అతనికి దైవ భక్తి మెండు. రోజూ ఇంట్లో పూజ చేసేవాడు. అతని ప్రార్థన ఎప్పుడూ "దేవుడా, నాకు ఇవాళ్ళ వంద రూపాయలు దొరికేటట్లు చూడు దేవుడా, నీకో కొబ్బరి కాయ కొడతాను!" అని ముగిసేది.

ఒక రోజున అట్లా ప్రార్థన చేసి బయటికి వెళ్ళిన పాపయ్యకు రోడ్డు ప్రక్కనే పెళపెళలాడే వందరూపాయల నోటొకటి కనిపించింది.

'ఇది దేవుడిచ్చిన సొమ్ము! కొబ్బరి కాయ కొట్టాల్సిందే' అనిపించింది అతనికి. కానీ వెంటనే "అయ్యో! టెంకాయ కొంటే ఇరవై రూపాయలు ఖర్చు' అని కూడా అనిపించింది.

అంతలోనే ఎదురుగుండా రెండు కొబ్బరికాయల అంగళ్ళు కనబడ్డాయి. వాటిని చూడగానే అతనికి ఒక ఆలోచన వచ్చింది. నేరుగా ఒక అంగడికి వెళ్ళి, "ఇదిగో, నువ్వు కుళ్ళిపోయిన టెంకాయలు అమ్ముతావట కదా?" అని అడిగాడు. దుకాణం వాడు పళ్ళు కొరుకుతూ "ఎవరు చెప్పారు నీకు?" అని అరిచాడు.

"అదిగో ఆ ప్రక్క దుకాణం వాడు" అన్నాడు పాపయ్య సంతోషంగా.

"ఆగు, ఇప్పుడే వస్తాను. వాడితో కొంచెం మాట్లాడేది ఉంది" అని పాపయ్యని అక్కడే వదిలి ప్రక్క దుకాణం మీదికి పోయాడు అతను.

అంతే.. ఇక పాపయ్య క్షణం ఆలస్యం చెయ్యకుండా ఒక టెంకాయని తీసుకొని సంచీలో వేసుకొని జారుకున్నాడు.

ఆ సంతోషం కొద్దీ మరునాటి నుండీ దేవుడికి మరింత భక్తితో పూజ చెయ్యసాగాడు పాపయ్య: "దేవుడా! మళ్ళీ వంద రూపాయలు దొరికించు. అట్లాగే నీ చలవతో కొబ్బరి కాయ కూడా దొరికేట్లు చెయ్యి. నీ రుణం ఉంచుకోను" అని.

కొద్ది రోజులకే పాపయ్యకు మరో వంద రూపాయల నోటు దొరికింది. "ఆహా! దేవుడు దయామయుడు" అనుకొని, పాపయ్య మళ్ళీ తన పాత ఉపాయాన్నే ప్రదర్శించబోయాడు.

అయితే ఈసారి అంగళ్ళ వాళ్ళు మోసపో-లేదు. “నువ్వు కుళ్ళిపోయిన టెంకాయలు అమ్ముతావట గదా?” అనగానే, "అవును. ఎన్ని కావాలి?” అన్నాడు అంగడాయన. పాపయ్యకు వెంటనే ఏమనాలో తెలీక నీళ్ళు నమిలాడు.



ఆలోగా వెనకనుండి వచ్చిన మనుషులు కొందరు పాపయ్యను పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు. దుకాణాల వాళ్ళు అందరూ కలిసి అతన్ని చితకబాదారు.

అసుపత్రి ఖర్చులు తడిసి మోపెడైనాయి. అటుపైన పాపయ్య ప్రార్థనలో ఎన్నడూ వంద రూపాయల ప్రస్తావన రాలేదు.




# కాబోయే కోడలు

*సేకరణ: పి. శ్రావణి, ఏడవతరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, తెల్లాపుర్, రంగారెడ్డి జిల్లా.*

రామయ్య ఒక పెద్ద మోతుబరి రైతు. ఆయన కొడుకు పెళ్ళీడుకు వచ్చాడు. తనకు కాబోయే కోడలుకు పనీ-పాట, శుచీ-శుభ్రం అన్నీ బాగా తెలిసి ఉండాలి; డబ్బు లేకున్నా పరవాలేదు గానీ, సుగుణాల రాశి అయి ఉండాలి' అని రామయ్యకు గట్టి కోరిక.

'అట్లాంటి పిల్లను తనే స్వయంగా వెతకాలి' అని ఒక రోజున ప్రత్యేకంగా ఆ పని మీదే బయలుదేరాడు.

ఎద్దుల బండి నిండా రేగిపళ్ళు నింపుకుని చుట్టు ప్రక్కల గ్రామాలలో అమ్మబోయాడు. వీధుల వెంట బండిని తోలుకుంటూ, "పళ్లో పళ్ళు-రేగిపళ్ళు- చెత్తకు తగు పళ్ళు ఇస్తాం!" అని అమ్ముతున్నాడు. ఎంత చెత్త ఇస్తే అన్ని రేగిపళ్లు!

"ఈయనెవరో బాగున్నాడు- చెత్తకు బదులుగా రేగిపళ్ళు ఇస్తాడట!" అని, ఊళ్ళలో ఆడవాళ్లంతా అప్పటికప్పుడు

ఇళ్ళూ వాకిళ్ళూ ఊడవటం మొదలు-పెట్టారు. ఎప్పటినుండో పేరుకుపోయిన చెత్తనంతా పోగు చేసి, గోనె సంచుల్లోను, గంపల్లోను ఎత్తి పట్టుకొచ్చారు. రామయ్య వాళ్లందరి దగ్గరా చెత్తను తీసుకొని, ఆ బరువుకు తగినట్లు రేగిపళ్ళు ఇస్తూ పోయాడు.




త్వరలోనే హడావిడి మొదలైంది: "చూడు, నేనెంత చెత్త పోగు చేసుకొచ్చానో? నీకంటే ఎక్కువ!" అని అంతా పోటీలు పడసాగారు. పెద్దాయన చిరునవ్వుతో వాళ్ళ పోటీని ప్రోత్సహించ సాగాడు.

ఇంతలో ఒక అమ్మాయి ఓ చిన్న చాటలో కాసింత చెత్తను పట్టుకొని వచ్చింది. అక్కడున్న అమ్మలక్కలంతా ఆ చిన్న చాటని చూసి ఎగతాళిగా నవ్వారు.

"ఏంటి తల్లీ, ఇంత తక్కువ చెత్తను తీసుకు వచ్చావు?! ఈ కాస్త చెత్తకు ఎన్ని పళ్లు ఇమ్మంటావు?" అన్నాడు రామయ్య, ఆ కాస్త చెత్తా తీసుకుంటూ.

"అయ్యో! ఏదో రేగిపళ్ళ మీది మోజుతో తెచ్చాను గాని, ఇది కూడా మా ఇంటిది కాదయ్యా! మా ఇంట్లో అసలు చెత్తనే లేదు; మా ప్రక్కవాళ్ళ ఇంటి ముందు దొరికింది ఇది!" అంది ఆ అమ్మాయి, సిగ్గుపడుతూ.

తన ఉద్దేశం నెరవేరినందుకు తనలో తాను సంతోషపడ్డాడు రామయ్య. రేగిపళ్ళు ఇచ్చే సాకుతో ఆ అమ్మాయితో పాటు వాళ్ళ ఇంటికి కూడా వెళ్ళి చూసాడు. నిజంగానే ఇల్లు అద్దంలా మెరిసిపోతున్నది.

పొదుపు, శుభ్రత రెండూ ఉన్న ఆ అమ్మాయి త్వరలోనే రామయ్య ఇంటి కోడలైంది.



# యువరాణి మౌనవ్రతం

రెండు పేజీల కథ

రచన : మీనాక్షి , పదవతరగతి, జహీరాబాద్

యువరాణి మయూరీదేవికి యుక్తవయసు వచ్చింది. ఆమెకు వివాహం చేయాలని అనుకున్నారు రాజుగారు. యువరాణి కూడా సరేనన్నది; కానీ తండ్రిని చిత్రమైన కోరిక ఒకటి కోరింది:

"ఈ రోజు నుంచి నేను ఎవ్వరితోటీ మాట్లాడను. పూర్తిగా మౌనం పాటిస్తాను. నా యీ మౌనవ్రతాన్ని ఎవరైతే భంగం చేస్తారో ఆ వ్యక్తినే నేను పెళ్ళి చేసుకుంటాను" అని. రాజుగారు సరేనని, ఆ సంగతినే దేశదేశాలా చాటించారు.

రాకుమారి అందచందాల గురించి విన్న యువకులు ఎందరెందరో వచ్చి, ఆమె మౌనవ్రతాన్ని భంగపరచాలని ప్రయత్నిం-చారు. వారిలో ఎందరో అందగాళ్లూ, వీరులూ, శూరులూ అయిన యువరాజులు ఉన్నారు. కానీ ఎవ్వరికీ ఆ భాగ్యం దక్కలేదు. రోజులు గడిచిపోతున్న కొద్దీ రాజుగారికి బెంగ పట్టుకున్నది: "ఇక నా కుమార్తెకు వివాహం జరగదేమో!" అని.

ఆ సమయంలో యువకుడు ఒకడు వచ్చాడు సభలోకి. అతడి శరీరం బలంగా, కండలు తిరిగి ఉన్నది. చూసేందుకు 'ఇతనెవరో యోధుడు' అనే అనిపిస్తున్నది;

కానీ అతని దుస్తులు మాత్రం 'ఇతనొక పేదవాడు' అని తెలియజేస్తున్నాయి.

ఆ యువకుడు నేరుగా మహారాజు దగ్గరకు వచ్చి నమస్కరిస్తూ "మహారాజా! యువరాణీవారు కొంత కాలం క్రితం వేటకు వచ్చినప్పుడు, అతి సామాన్యుడినైన నన్ను వివాహం చేసుకున్నారు. అయితే నా పేదరికం కారణంగా ఆ విషయాన్ని మీకు చెప్పలేక, ఇలా 'మౌనవ్రతం' అంటూ కాలం వెళ్లబుచ్చుతున్నారు!" అన్నాడు. సభ అంతటా ఒక్కసారిగా నిశ్శబ్దం అలుముకున్నది.

రాజుగారు సభలోనే ఒక ప్రక్కగా కూర్చున్న మయూరీదేవి వైపు చూసారు. ఆమె "కాదు" అన్నట్లు అడ్డంగా తల ఊపింది.

అంతలోనే యువకుడు తన జేబులోంచి ఒక ఉంగరాన్ని తీసి చూపుతూ, "మా ప్రేమకు గుర్తుగా నాకు ఆమె ఇచ్చిన ఉంగరం ఇదిగోండి!" అన్నాడు.

వెంటనే మయూరిదేవి లేచి నిలబడి ఆవేశంగా "అంతా అబద్ధం! ఇతను ఎవరో నాకు తెలియదు! ఆ ఉంగరం నాది కాదు!" అంటూ గట్టిగా అరిచింది.



ఆ యువకుడు కూడా చిరునవ్వు నవ్వుతూ "అవును- నేనెవరో మీకు తెలియదు. నేను అవంతీ దేశపు యువరాజును. వివేకవర్ధనుడు అంటారు నన్ను. మీ మౌనవ్రతాన్ని భంగం చేసేందుకే ఇలా ఉంగరాన్ని తెచ్చాను" అంటూ తన మారువేషాన్ని తొలగించాడు.

సభికుల హర్షధ్వానాల మధ్య యువరాణి వివేకవర్ధనుడిని వరించింది.



# కాత్యాయని తెలివి

*రచన: శ్రీ కె.వి.క్రిష్ణారావు గారు, కర్నూలు.*

రంగాపురపు గోపాలయ్య కష్టజీవి. అయితే ఆ కష్టంవల్ల గోపాలయ్య సంపాదించిందంతా ఒకే ఒక్క ఆవు; ఓ చిన్నపాటి పొలం. ఆ ఒక్క ఆవువే పాలు-పెరుగు అమ్మి, ఉన్నంతలో పొదుపుగా బ్రతికేవాళ్ళు వాళ్ళు.

'నా తర్వాత మా రాజయ్య ఎట్లా బతుక్కుంటాడు?' అని గోపాలయ్యకు విచారంగా ఉండేది. ఆ విచారానికి కారణం లేకపోలేదు: గోపాలయ్య కొడుకు రాజయ్య చాలా అమాయకుడు. వాడి అమాయకత్వం వల్ల ఒక్కోసారి చాలానే కష్టం అయ్యేది. లౌక్యంతో కూడుకున్న పనులు చెడిపోయేవి. కుటుంబం అంతా ఎగతాళికి గురి అవ్వాల్సి వచ్చేది.

"రాజయ్యకు ఓ మంచి తెలివైన పిల్ల భార్యగా దొరికితే చాలు- వాళ్ళు సుఖంగా బ్రతుక్కుంటారు" అని ఆలోచించిన గోపాలయ్యకు, తన చిన్ననాటి స్నేహితుడు

శంకరయ్య గుర్తుకొచ్చాడు. 'శంకరయ్యదీ తమలాంటి కుటుంబమే. వాడిని అడిగితే పొరుగూరిలో ఏమైనా సంబంధాలు చూసి పెడతాడు..'



ఆ ఆశతోటే అతను ఒకనాడు పనిమళ్ళా పోయి శంకరయ్యను కలిసాడు. "రా! రా! గోపాలా! ఎంతకాలానికి గుర్తొచ్చాను నీకు! మీవాడికి ఐదారేళ్ళు ఉన్నప్పుడు కలిసాం! ఎట్లా ఉన్నావు నువ్వు?! వదినమ్మ ఎలా ఉన్నది?!" అంటూ ఆప్యాయంగా పలకరించాడు శంకరయ్య.

ముచ్చట్లు అవీ పూర్తయ్యాక-"శంకరయ్యా! పిల్లాడు పెళ్ళీడుకు వచ్చాడు. ఎవరైనా మంచి పిల్లని తెచ్చి వాడి పెళ్ళి చేసెయ్యాలని అనుకుంటున్నాను. నీకేమైనా సంబంధాలు తెలిస్తే చూడు. మావాడు కష్టపడి పని చేస్తాడు; కానీ బాగా అమాయకుడు. మాకు ఓ ఆవు, చిన్నపాటి పొలం ఉన్నాయి. ఎట్లాగో అట్లా వాడికి ఓ మంచి తెలివైన అమ్మాయినిచ్చి పెళ్ళి చేస్తే, నా బాధ్యతా తీరుతుంది; మా వాడి జీవితమూ ఒక దారిన పడుతుంది" అని చెప్పాడు గోపాలయ్య.

శంకరయ్య మురిసిపోతూ "గోపాలయ్యా! మీవాడు లక్షణంగా బాగుంటాడు. నీ మాట మీద నమ్మకం ఉంది. అన్ని ఆస్తులూ ఒక ఎత్తు; కష్టపడే లక్షణం మరొక ఎత్తు. ఆ ఒక్క లక్షణం ఉంటే చాలు- ఆస్తిపాస్తులు అన్నీ సమకూర్చుకోవచ్చు. మీ కుటుంబానికి చక్కగా సరిపోతుంది నా బిడ్డ కాత్యాయని. ఆమెని నీ కొడుకుకు ఇస్తే బాగుంటుం-దనిపిస్తుంది..” చెప్పాడు శంకరయ్య.

'అంతకన్నానా! అయితే ముందు నీ కూతురితో నన్ను రెండు మాటలు మాట్లాడనివ్వు!" అన్నాడు గోపాలయ్య




"కాగల కార్యం గంధర్వులు తీర్చటం అంటే ఇదేనేమో" అంటూ తన కూతురు కాత్యాయనిని పిలిచాడు శంకరయ్య.

"కాత్యాయనీ! నా చిన్ననాటి స్నేహితుడు గోపాలయ్య మామయ్య వచ్చాడు; కాసిని మంచి నీళ్ళు పట్టుకురా తల్లీ!" అని.

శుభ్రంగా తోమిన గ్లాసులో మంచినీళ్ళు పట్టుకొని వచ్చింది కాత్యాయని. గోపాలయ్య ఆమెను ప్రేమగా పలకరించి, 'నేను నిన్ను రెండు చిన్న ప్రశ్నలు అడుగుతాను, సమాధానం చెబుతావామ్మా?' అని అడిగాడు.

"అడగండి మామయ్యా!" అన్నది కాత్యాయని.

"మన ఇంటికి ఎవరైనా అతిధి వచ్చాడనుకోమ్మా, బాగా ఆకలితో; సరిగ్గా ఆ సమయానికి మన ఇంట్లో కూరలు లేక పోతే ఎలాగ? మనం పెట్టే భోజనం అతనికి రుచిస్తుందా?" అని అడిగాడు గోపాలయ్య.

"ఆకలి రుచి ఎరుగదు అంటారు కదా మామయ్యా! ఇంట్లో ఉన్న పచ్చడి, పెరుగు కూడా అట్లా ఆకలిగా ఉన్న వాడికి పంచ భక్ష్య పరమాన్నాలుగా తోస్తాయి, కూరగాయలే పెట్టాలని ఏమీ లేదు" చెప్పింది కాత్యాయని.

ఆ జవాబుకి గోపాలయ్య తృప్తి చెంది, మరొక ప్రశ్న అడిగాడు- "ఒక వేళ ఎవరైనా తెలివైన అమ్మాయికి అమాయకుడైన భర్త దొరికాడనుకో, అప్పుడు అ అమ్మాయి ఏం చేయాలి?" అని.

"అమాయకుడైతే ఏం నష్టం? మంచివాడు, కష్టపడే తత్వం ఉన్నవాడు అయితే చాలు- అన్నీ సర్దుకుంటాయి" అన్నది కాత్యాయని.

ఆమె మాటలు విన్న తర్వాత గోపాలయ్య మనసు చల్లబడ్డది. అటు తర్వాత ఇరు కుటుంబాల వాళ్ళూ మాట్లాడుకుని, కాత్యాయని, రాజయ్యల పెళ్లి జరిపించారు.

గోపాలయ్యకు ఊరి బయట ఒక ఎకరా భూమి ఉంది. దానిలో ఏదైనా పండించాలంటే బాగా దున్నాలి. దానికి నీటి వసతి కూడా లేదు. దున్నించాలంటే డబ్బు కావాలి; అటు తర్వాత చేనులో పని చేసిన కూలీలకు డబ్బు లివ్వాలి. అంతా చేస్తే తిరిగి ఎంత వస్తుందో తెలీదు. వానలు పడతాయో, లేదో? అసలు గోపాలయ్య దగ్గర పెట్టుబడి పెట్టేందుకు అంత డబ్బు కూడా లేదు!

కాత్యాయని ఒక ఆలోచన చేసింది. ఒక రోజున రాజయ్యను వెంటబెట్టుకొని పొలం దగ్గరకు వెళ్ళింది. తను చెప్పినట్టు చెయ్యమంది రాజయ్యను. ఇద్దరూ చెరొక గడారి (గడ్డపార) తీసుకుని పొలంలో అక్కడక్కడా త్రవ్వటం మొదలు పెట్టారు.

పక్క చేను గురవయ్య అనే భూస్వామిది. అతను వీళ్ళు చేస్తున్న పనిని చూసి, గబగబా వాళ్ల దగ్గరికి వచ్చి, "ఏంచేస్తున్నారు, మీరు?!" అని అడిగాడు.



"ఏం చెయ్యట్లేదన్నా! మా మామగారి తండ్రి ఎప్పుడో ఈ పొలంలో రెండు చిన్న పాత్రల నిండా బంగారం దాచాడట. వాటి కోసం త్రవ్వి చూస్తున్నాము. ఒకవేళ అవి గనక దొరికితే మాదరిద్రం కాస్తా వదిలిపోతుంది!" అన్నది కాత్యాయని.

సాయంత్రం వరకూ అట్లా త్రవ్వి త్రవ్వి, రాజయ్య, కాత్యాయని ఇద్దరూ ప్రశాంతంగా ఇంటికి వెళ్ళిపోయారు. అయితే ఆ రాత్రి గురవయ్యకు నిద్ర పట్టలేదు. ఊరికే

వస్తేచాలు- ఏదైనా తీసుకునే రకం అతను. అందుకే అతను, అతని కొడుకు ఇద్దరూ రాజయ్య పొలానికి వచ్చి రాత్రికి రాత్రి చేను అంతా త్రవ్వి పడేశారు. ఎంత త్రవ్వినా వాళ్లకు ఏ బంగారు పాత్రా దొరకలేదు.

రెండో రోజు ప్రొద్దున్నే కాత్యాయని, రాజయ్య వెళ్ళే సరికి పొలం అంతా చక్కగా దున్ని పెట్టి ఉంది! అది గురవయ్య పనే అని కూడా కాత్యాయని కనిపెట్టింది. ఆమె, రాజయ్య ఇద్దరూ ఆ రోజంతా అక్కడ చేనులో జొన్నలు చల్లారు.

మరుసటి రోజున కాత్యాయని తన ఇంటికి తోరణాలు కట్టి, లక్ష్మి పూజ చెయ్యటం మొదలెట్టింది. ఊర్లలో విషయాలు ఆగవు కదా, సంగతి చటుక్కున గురవయ్యకు కూడా చేరింది. "ఓహో! అయితే బంగారు పాత్రలు దొరికి ఉంటాయి వాళ్లకి!" అనుకొని అసూయతో రగిలిపోయాడు గురవయ్య.

"ఈరోజు రాత్రి మా ఇంట్లో దొంగలు పడబోతున్నారు" అని నవ్వుకున్న కాత్యాయని, రాజయ్యను దగ్గరికి పిలిచి, "ఇవాళ్ల రాత్రి నువ్వు నన్ను యీ యీ ప్రశ్నలు అడగాలి, గట్టిగా, ప్రక్క ఇళ్ళ వాళ్లకు కూడా వినబడేలా!" అని అవేంటో చెప్పింది. కాత్యాయని తెలివితేటల మీద పూర్తి నమ్మకం ఉన్న రాజయ్య సరేనన్నాడు.

అనుకున్నట్టుగానే ఆరోజు రాత్రి వాళ్ళింట్లో దొంగతనానికి వచ్చాడు గురవయ్య. అర్థరాత్రి అవుతుందనగా కిటికీ తెరలు ప్రక్కకు జరిపి, దొంగగా లోపలికి చూడటం మొదలెట్టాడు.

అతనికోసమే ఎదురు చూస్తున్న కాత్యాయని భర్తని మోచేత్తో పొడిచి, 'అందరూ పడుకున్నారు. ఇప్పుడు అడుగు, ఏం అడుగుతావో!' అన్నది.

"ఆ బంగారు పాత్రల సంగతేమిటి?" గట్టిగా అడిగాడు రాజయ్య. కిటికీ అవతలినుండి గురవయ్య చెవులు రిక్కించుకొని వింటున్నాడు.

అది చూసుకున్న కాత్యాయని, "అబ్బ! హాయిగా పడుకోవయ్యా! మనకేమీ భయంలేదు. ఎవరైనా దొంగలు వస్తే కష్టం

కదా అని, బంగారు పాత్రల్ని మన ఇంటి ఎదురుగా ఉన్న ఆ పెద్ద చెట్టు కొమ్మల్లో దాచాను" అని జవాబిచ్చింది.

అది విన్న గురవయ్య ఇంక ఆలస్యం చేయలేదు- గబుక్కున వెళ్లి ఆ చెట్టు ఎక్కాడు. మసక వెలుతురులో, కొమ్మల మాటున నిజంగానే ఏవో పాత్రల వంటివి కనబడ్డాయి అతనికి. విప్పారిన మొహంతో గబుక్కున వాటిని అందుకోబోయాడు గురవయ్య! అయితే అవి పాత్రలు కాదు ! తేనె పట్టులు!

తక్షణం ఝుమ్మని పైకి లేచిన తేనెటీగలు గురవయ్యని చుట్టు ముట్టి, వళ్ళంతా కుట్టి కుట్టి వదిలాయి. గురవయ్య హాహాకారాలు చేసుకుంటూ చెట్టు మీది నుండి జారి కింద పడ్డాడు!

అతని అరుపులు విన్న రాజయ్య, కాత్యాయని హడావిడిగా ఇంటి బయటికి వచ్చి చెట్టు కింద పడి ఉన్న తేనెపట్టును గిన్నెలోకి ఎత్తుకొని, అట్లానే గురవయ్యను కూడా మర్యాదగా లేవనెత్తి, ఇంట్లోకి తీసుకెళ్ళి, చక్కగా పసరు మందు తెచ్చి రాసి, మంచి నీళ్ళు త్రాపి, తెల్లవారాక మర్యాదగా సాగనంపారు.

ఆ సంఘటనతో గురవయ్యకు జ్ఞానోదయం అయింది. మంచి మనుషులకు అన్యాయం చేయాలని చూస్తే తనకే తగిన శాస్తి జరిగిందని అర్థమైంది. 'వీళ్లతో పెట్టుకుంటే మొదటికే మోసం వస్తున్నది!" అని ఇంక వాళ్ల జోలికి పోకుండా ఊరుకున్నాడు.

అంతలో వానా కాలం రానే వచ్చింది. బాగా త్రవ్వి గింజలు వేసినందున రాజయ్య పొలంలోకి నీరు ఇంకి, ఆ ఏడాది బలే బాగా పండింది.

కాత్యాయని తెలివికి రాజయ్య, గోపాలయ్య ఇద్దరూ ఎంతో సంతోషించారు.

కాత్యాయని సాహచర్యంలో రాజయ్య కూడా అమాయకత్వాన్ని వీడి తెలివిమంతుడైనాడు. కష్టానికి తెలివి తేటలు కూడా తోడవ్వటంతో అటుపైన వాళ్ళిద్దరూ పట్టిందల్లా బంగారమైంది.






# పాము పగ?

*రచన: మద్దిరాల శ్రీనివాసులు, కంకణాలపల్లి*

పుల్లయ్య ఒక సన్నకారు రైతు. అతనికి ఉన్న ఆస్తల్లా రెండెద్దులు, మూడెకరాల పొలం, పొలంలోనే ఒక మూలగా ఇల్లు. ఇంటికి పక్కనే ఎద్దులకోసం ఓ పాక, దానికి కొంచెం అవతలగా పేడ దిబ్బ ఉంటుంది.

ఇంటి పెరట్లో కూరగాయలు వేస్తాడతను. ఓ అర్థ ఎకరంలో పశువుల మేతకోసం గడ్డి పెంచుతాడు.

అందరు రైతుల్లాగే పుల్లయ్య కూడా ప్రతిరోజూ చీకట్లోనే లేస్తాడు. ఎద్దుల్ని మేతకు వదలటం, పాకని శుభ్రం చేసుకోవటం, తర్వాత పొలం పనులు; సాయంత్రం అవుతుండగా ఊర్లో రచ్చబండ దగ్గర కబుర్లు- ఇదీ, పుల్లయ్య దినచర్య.

ఓ రోజు అతను కసువు ఊడ్చి దిబ్బలో వేయబోతుండగా, మసక వెలుతురులో

కనబడింది- పాము తోక! పాము తలేమో దిబ్బకు అవలివైపుగా ఉన్నది. అది ఇప్పుడే ఏ ఎలుకనో మెక్కి ఉంటుంది; చురుకుగా కదలటం లేదు; అలికిడినీ పట్టించుకోలేదు.




పుల్లయ్య స్వతహగా ధైర్యవంతుడే; కానీ అతనిది కొంచెం సున్నితమైన మనసు. అందుకే 'చంపుదామా, వద్దా?!' అని ఆలోచనలో పడ్డాడు. 'అది నన్ను ఏమీ చేయలేదు కదా' అనుకున్నాడు. 'అలా అని వదిలేస్తే?'

'ఇల్లు ఇక్కడేనాయె. భార్యాపిల్లలు తిరుగుతుంటారు. ఎవరికైనా ఏదైనా జరగరానిది జరిగితే ఎలాగ?' పామును గమనిస్తూనే ఆలోచించసాగాడు. యింతలో పాము కాస్త కదిలింది.

పుల్లయ్య మనసూ గట్టి పడింది. అక్కడే ఉన్న ఓ కట్టె పట్టుకొని చటుక్కున ఒక్క దెబ్బ వేశాడు. వేటు సరిగ్గా పడ్డట్లు లేదు; పాము సరసర మని వంపులు తిరుక్కుంటూ పరుగు అందుకున్నది. పుల్లయ్య దాని వెంట పడి మరో రెండు వేట్లు వేశాడు. అయినా అది తప్పించుకున్నది.

పది రోజులు గడిచినై. ఒక రోజు సాయంత్రం పూట పొలంలో తిరుగుతుంటే అల్లంత దూరాన పాము కుబుసం ఒకటి కనబడింది పుల్లయ్యకు. అటు ఇటు చూస్తే అక్కడో గట్టు వెంబడి పాక్కుంటూ పోతున్నది పాము!

"అమ్మో!" అనుకున్నాడు పుల్లయ్య. "కొంపదీసి ఆ పాము పగ పట్టలేదు కద?!" అనుమానం మొదలైంది.

ఆరోజు ఇంటికెళ్లి పడుకున్నాక నిద్రపట్టింది

గానీ, ఎక్కడ లేని కలలూ వచ్చాయి. అయితే నిద్ర లేచేసరికి పాము సంగతి అతనికి గుర్తు లేదు.

మరో రెండు వారాల తర్వాత, ఎద్దులకు కుడితి పెడుతుండగా, పక్కనే ఏదో 'సరసర' ప్రాకినట్లయి, మళ్ళీ పాము గుర్తొచ్చింది. చేతిలో పనినంతా వదిలి దిబ్బ వరకూ అన్ని వైపులా చూసుకొచ్చాడు. ఊహు! ఏమీ దొరక లేదు.

మరో పక్షం రోజులు గడిచాయి. రాత్రి ఆరుబయట పడుకున్నారు అందరూ. ఎద్దు మెడలో గంటల శబ్దం అవ్వటంతో ఉన్నట్లుండి మెలకువ వచ్చింది. చూస్తే ఎద్దు లేచి నిలబడి ఉన్నది. ప్రక్కనే గంప క్రింద కోళ్లు 'క్కొక్కొక్కొ...'మంటున్నాయి...

'పాము!'అనుకుంటూ చటుక్కున కర్ర తీసుకుని ముందుకు ఉరికాడు పుల్లయ్య. చిన్న బల్బు వెలుతురులో కనబడింది పాము- ఓ ఆరడుగుల దూరంలో గబగబా పాక్కుంటూ పోతున్నది.

పుల్లయ్య అనుమానం బలపడింది. "ఈ పాము నాపై పగ పట్టినట్టుంది. ఏదో ఒకటి చేయాలి రేపు" అనుకున్నాడు. ఆ రోజు సాయంత్రం రచ్చబండ దగ్గర చేరిన మిత్రులతో ఈ సంగతులన్నీ చెప్పాడు.

"జాగ్రత్తరోయ్! పాములు విషం!" అన్నాడు వెంకటయ్య.



"మన వెంకటసామి కాడికెళ్లు బావా! ఇసుక మంత్రించి ఇస్తాడు. ఇంటి సుట్టూ జల్లు; సరిపోద్ది. పిల్ల-జెల్ల తిరిగేదాయె!" బామ్మర్ది సుబ్బయ్య సలహా ఇచ్చాడు.

"ఇదో పుల్లయ్యా! ఎందుకైనా మంచిది; కాస్త

జాగ్రత్తగానే ఉండు. పక్కూళ్ళో పాములు పట్టే ఈరన్నుండ్లా, ఆణ్ణి పిలిపించుకో. నాల్రోజులు ఇంటి దగ్గరే రాత్రికి బస ఏర్పాటు జేయి. ఆడే జూసుకుంటాడు" అన్నాడు మరో పెద్దాయన.

ఇంతలో రాజారావు వచ్చాడు అక్కడికి. అతను పట్నంలో లెక్చరర్‌గా పని చేస్తుంటాడు. సంగతంతా విని, అతను పెద్దగా నవ్వాడు.

"అదేంటిరా?! మీ మామ భయంతో వణికిపోతా వుంటే నీకు నవ్వుతాలుగా ఉందా?" అడిగాడు వెంకయ్య.

"లేకపోతే ఏంది, పెద్దయ్యా?! మనం ఏ కాలంలోఉన్నాం? పాములు పగ పట్టడమేంటి? ఇంత పెద్ద బుర్ర ఉన్న మనమే అనేక విషయాలు మరిచిపోతూ ఉంటామే, ఇంక పాముకు ఎంత మెదడు ఉందనుకున్నారు? దానికి ఉండే మెదడే వేపకాయంత. అంత చిన్న మెదడులో దానికి ఇంకా ఇంత జ్ఞాపకశక్తి అంటూ అసలు ఉండనే ఉండదు!" నవ్వాడు రాజారావు.

"అంటే ఏందిరా, నువ్వనేది?.. పాములు పగపట్టవు అంటుండావా?" సుబ్బయ్య తాత.

"అవును తాతా, వాటికంత సీను లేదు"

"మరైతే రెండు నెలలుగా ఆ పాము నా చుట్టూతానే ఎందుకు తిరుగుతోంది అల్లుడూ?! నేను ఇట్టాంటివి పట్టించుకోనని నీకు తెలుసు కదా; అందుకే మొదట్లో పట్టించుకోలేదు- కానీ జరిగినవన్నీ చూస్తుంటే నమ్మక ఎట్టుండేది?" పుల్లయ్య అడిగాడు భయంతో.

రాజారావు అందరికేసీ చూస్తూ చెప్పాడు- "సరే! అందరూ మరి నాతోబాటు పుల్లయ్యమామ ఇంటికి రండి! ఈ పాము పగ సంగతేందో స్పష్టంగా తేల్చేస్తాను. పుల్లయ్య మామా! నీ సమస్య తీరిందంటే మరి, మాకు అందరికీ మంచి భోజనం పెట్టించాలి, సరేనా?" అని.

అందరూ కదిలి పుల్లయ్య ఇల్లు చేరారు. వాళ్ళందరినీ అక్కడ తిన్నెలమీద కూర్చోబెట్టి, రాజారావు ఒక్కడే మెల్లగా పేడ దిబ్బ దగ్గరికి

వెళ్ళాడు. ఏం మంత్రం వేసాడో మరి, కొద్ది సేపట్లోనే ఒక పామును, దాని నోటి దగ్గర నొక్కి పట్టుకొని- తీసుకొచ్చాడు! సన్నగా, గోధుమరంగులో మెరిసిపోతూ, నాలుగడుగుల పొడవు ఉంది అది.

అందరూ తిన్నెలమీద నిలబడి హాహాకారాలు చేసారు.

"చూడు మామా, మూడు నాలుగు మార్లు పామును చూసినావు గదా, దీన్నేనా?" అడిగాడు రాజారావు.

"ఇదే గావచ్చురా అల్లుడూ! దొంగది, నామీద పగ బట్టింది చూడు!" అన్నాడు పుల్లయ్య దానికేసే కోపంగా చూస్తూ.

గుడ్లప్పగించి తన చేతిలోని పామునే చూస్తున్న పుల్లయ్య కొడుకుని ఉద్దేశించి "కొన్ని గోనె సంచీలు తే రా" అని, రాజారావు చెప్పాడు- "ఇది విషం పాము కాదు మామా! దీని తల చూసావా, ఎలా ఉందో? విషం పాము తల త్రిభుజాకారంలో ఉంటుంది- దీనికి పళ్ళు ఉంటాయి గానీ, కోరలు ఉండవు చూడండి-" అని ఒక పుల్లతో ఆ పాము నోరు తెరిచి చూపాడు.

అందరూ ఆశ్చర్యంగా చూసారు.

ఆ పాముని గోనె సంచీలో వేసి మూతి బిగించిన రాజారావు, ఈసారి పశువుల శాల వెనకవైపుకు వెళ్ళి, ఐదు నిముషాల్లో మరో పాముతో తిరిగి వచ్చాడు- ఇది లావుగా, నల్లగా మెరిసిపోతూ ఆరేడు అడుగుల పొడవు ఉంది!

"ఇదే! ఇదే! నన్ను వెంటాడిన నాగుపాము ఇదే" అన్నాడు పుల్లయ్య, చెమటలు కక్కుతూ.

"మామా! దీన్ని జర్రిపోతు- 'రాట్ స్నేక్' అంటారు. చూసేకి నాగుపాములా ఉంటుంది కానీ, ఇది ఎలుకల్ని తిని రైతుకు మేలు చేస్తుంది. దీనికి కూడా విషం ఉండదు-" అని దాని నోటినీ ఓ పుల్లతో తెరిచి చూపాడు రాజారావు.

ఆ పాముని కూడా గోనె సంచీలో వేసి మూతి బిగించాక, మళ్ళీ పోయి, ఈసారి దగ్గర్లోని

పొదలోంచి చటుక్కున ఓ పామును ఎత్తుకొచ్చాడు- సన్నగా, కట్లు కట్లుగా ఉందది. ఎక్కువ పొడవు కూడా లేదు- ఏదో పాము పిల్ల ఉన్నట్లు ఉంది- "ఇది విషం పాము పెద్దయ్యా! కట్లపాము! దీని నోట్లో కోరలుంటాయి చూడండి!" అంటూ ఓ పుల్లతోటి దాని నోరు తెరిచి చూపించాడు- నోట్లో రెండు వైపులా రెండు పెద్ద పెద్ద కోరలు ఉన్నాయి! ఇది కరిస్తే కొద్ది గంటల్లో మనిషి చచ్చిపోతాడు. మీకు కనబడింది ఇదేనా?" అన్నాడు రాజారావు.

"ఇది కాదురా అల్లుడూ! నాకు కనిపించింది ఇందాకటి జర్రిపోతే అనుకుంటాను" అన్నాడు పుల్లయ్య అనుమానంగా.

కట్లపాముని కూడా గోనెసంచీలోకి వేసి మూట కట్టాక, రాజారావు వెళ్ళి వెతికి ఒక్కోసారి ఒక్కో పాము లెక్కన ఇంకో ఐదు పాములు పట్టుకొచ్చాడు!

"ఒరే! ఇక్కడేదో పాముల ఫ్యాక్టరి పెట్టినట్టు ఉన్నాడురా, మీమామ?!" నవ్వాడు సుబ్బయ్య తాత.

రాజారావు కూడా నవ్వుతూ చెప్పాడు "చూడండి, పుల్లయ్య మామ ఇల్లు ఊరి బయట ఉంది. కూరగాయల పంట ఉంది గనక, చెత్తాచెదారం బాగా పడుతుంది. దిబ్బలు గూడా దగ్గర్లోనే వేసుకునె!

దిబ్బలో కూరగాయలు, గింజలు తినేందుకని వాటిల్లోకి ఎలుకలు, ఏవేవో పురుగులూ, తేళ్ళూ, కప్పలూ అన్నీ చేరతాయి. ఇవన్నీ రాత్రి పూట బయటికి వస్తాయి. వాటి కోసమని ఎక్కడెక్కడి పాములూ వస్తాయి.

కూరమొక్కల గుబుర్లలో ఇవి పుట్టలు పెట్టుకోవచ్చు కూడా. ఇంకా వెతికితే ఎన్ని దొరుకుతాయో మరి-

పుల్లయ్య మామా! నువ్వు నాలుగైదు పాముల్ని చూసి ఉంటావు. ప్రతిసారీ ఆ పాము ఒకటే కానక్కర్లేదు. తరచుగా కంటపడటం వల్ల నీకు అట్లా అనిపించి ఉంటుంది.

పాములకు చెవులు ఉండవు! అయినా మనం అడుగులు వేసినప్పుడు భూమి

కంపిస్తుందే, ఆ కంపనల ద్వారా అవి మనం వస్తున్నామని పసిగట్టి, కుదిరితే పారిపోతాయి; లేకపోతే ప్రాణభయంతో కంగారు పడి, మిగతా ప్రాణులలానే పోరాడతాయి. అంతే" అన్నాడు.



ఇక ఎవ్వరూ రాజారావు మాటలకు ఎదురు పల్కలేక పోయారు. "అంతేనంటావా అల్లుడూ!" అని మాత్రం అనగలిగాడు పుల్లయ్య.

"అవును మామా, నీకు ఇంతకుముందే ఎన్నోసార్లు చెప్పాను- ఆ దిబ్బలు ఇంటికి దగ్గరగా వేయొద్దని, గుబురుగా చెత్తని పడేయొద్దని. అలా గుబుర్లు, చెత్త, చెదారం ఉంటేనే పురుగు పుట్ర చేరేది. పరిసరాలన్నీ పరిశుభ్రంగా ఉంచుకుని చూడు. ఇవేవీ ఇంక దగ్గరికి కూడా రావు. ఇంకా అనుమానం ఉంటే, ఎప్పుడూ పొలంలో గడ్డిలో తిరుగుతూ ఉంటావు కనుక, మోకాళ్ళ వరకూ ఉండే బూట్లు కొనుక్కో. కాళ్ళన్నీ మూసేసేలా ఉండే మందమైన బట్టలు వేసుకో. ఒకవేళ పొరపాటున ఏ పురుగో కొరికినా ఏమీ ప్రమాదం కాదు" జాగ్రత్తలు చెప్పాడు.

ఇక ఆ మరునాటి నుండే పరిసరాల పరిశుభ్రత కార్యక్రమం మొదలు పెట్టాడు పుల్లయ్య. దిబ్బల్ని ఇంటికి దూరంగా జరిపాడు. చెత్త, మరుగు, పొదలు ఇంటికి దగ్గరగా ఏవేమున్నాయో వాటినన్నిటినీ తొలగించి దిబ్బల్లో వేసేసాడు. పుల్లయ్యే కాదు- ఊళ్ళో చాలామంది తమ ఇంటి పరిసరాల్ని బాగు చేసుకున్నారు. ఇక అటుపైన వాళ్ళ ఇళ్లకు, పశువుల పాకలకు పాముల బెడద పూర్తిగా తొలగిపోయింది!




# సరైన కృషి

రచన: ఆర్.సి. కృష్ణస్వామి రాజు తిరుపతి ,

కృష్ణవర్మ మహారాజుకు ముగ్గురు మగ పిల్లలు. ముగ్గురూ ముగ్గురే, మహా సోమరులు. పిల్లలు అట్లా ఉంటే ఏ తల్లిదండ్రులకు మనసున పడుతుంది? వాళ్లని ప్రయోజకుల్ని చేయాలి, విద్యాబుద్ధులు నేర్పాలి అని రాజుగారికి గట్టి కోరిక కలిగింది.

'మా పిల్లల్ని తట్టుకోగల సమర్థులైన గురువులు ఎవరున్నారు?' అని బాగా వెతికారు కృష్ణవర్మ గారు. ఏ గురువుల్ని చూసినా 'వీళ్ళు కురరరు' అనే అనిపించింది. చివరికి ఎవరో చెబితే సువర్ణముఖీ నదికి ఆవలి ఒడ్డున 'ప్రజ్ఞ ఆశ్రమాన్ని' నడిపే మిత్రవిందులవారి దగ్గరికి వెళ్ళారు.

కొండల నడుమన, పచ్చటి చెట్ల మధ్య, అత్యంత ప్రశాంతంగా వున్న ఆశ్రమంలో

గురువులకు, శిష్యులకు కావల్సిన వసతులు అన్నీ ఉన్నాయి. మిత్రవిందులవారు రాజుకు బాగా నచ్చారు. బలంగా, చురుకుగా, జ్ఞానం-సాధన ఉట్టిపడుతూ ఉన్నారాయన.



"మా పిల్లలకు విద్య నేర్పమని అర్థించేందుకు వచ్చాను. మీరు రాజధానికి విచ్చేసి, కనీసం ఓ పదేళ్లపాటు మా పిల్లలకు పాఠాలు చెప్పాలి" అన్నాడు రాజు ఆయనతో.

మిత్రవిందులవారు నవ్వారు. "కాదు అంటున్నందుకు క్షమించాలి మహారాజా! మేం ఈ ప్రాంతాన్ని వదిలి వచ్చే వీలు లేదు. మా పద్ధతులకు నగరాలు సరిపడవు. అయినా అసలు అంత శ్రమ ఎందుకు పడతారు? మీ పిల్లల్ని ముగ్గుర్నీ నిశ్చింతగా మావద్ద వదిలి వెళ్ళండి. వాళ్ళు కూడా మా ఇతర, సామాన్య కుటుంబాలనుండి వచ్చిన శిష్యులతో బాటు విద్యలు నేర్చుకుంటారు. అలా వారికి లోకాచారం కూడా తెలుస్తుంది!" అన్నారు.

"కానీ ఇక్కడ.., రాకుమారులు ఉండేందుకు వసతి..-" నీళ్ళు నమిలారు రాజుగారు.

"ఇక్కడ వారు రాకుమారులు కాదు మహారాజా! విద్యార్థులు. గురుకులంలో విద్యార్థులందరూ ఒక్కటిగా నివసిస్తారు. కావాలంటే, వాళ్ళు అలవాటు పడే వరకూ మీరు నదికి అటు ఒడ్డునే ఉన్న దేవరకొండలో తాత్కాలిక వసతి ఏర్పాటు చేసుకోవచ్చు. నేను ఇది వారి మేలు కోరే చెబుతున్నాను- అన్యథా భావించకండి" గట్టిగా చెప్పేసారు మిత్రవిందులు.

చివరికి కృష్ణవర్మకు 'సరే' ననక తప్పలేదు. 'ముద్దుముద్దుగా పెంచిన రాకుమారులను కష్టపడమంటున్నాడే' అని బాధ కూడా కలిగింది.

అంతలోనే మిత్రవిందుడు "విద్య వంట బట్టాలంటే ముందు శరీరం చురుకుగా ఉండాలి. శరీరం చురుకుగా వుండాలంటే యోగాసనాలు, ప్రాణాయామాలు, వ్యాయామాలు నిత్యం చెయాల్సిందే. రాకుమారులను రేపటినుండీ ఉదయం నాలుగు గంటలకే నిద్ర లేవాలని చెప్పండి" అన్నాడు.

"అప్పుడేనా? ముందు ఒకటి రెండు రోజులు.." అని దాట వేయబోయిన రాజుగారికి "యోగ: చిత్త వృత్తి నిరోధ: అని తెలిసిందే కదా!" అని హితవు చెప్పేసి పంపేసాడు కూడా.

మొదట కొంత సంకోచించినా, తర్వాత రాజుగారు వెంటనే తేరుకొని, కుమారుల నివాసానికి ఏర్పాట్లు చేయించాడు. వాళ్ళు దేవరకొండలో సకల సౌకర్యాల నడుమన ఉంటారు; రోజూ ఉదయం రథంలో నది ఒడ్డుకు చేరుకుని, అక్కడ వారికై ప్రత్యేకించిన పడవలో ప్రతిరోజూ ఉదయం ఐదు గంటలకల్లా ఆశ్రమానికి చేరుకునేట్లు రథ సారథులను, కళాసీలను నియమించాడు.

ఆరు నెలలు గడిచాయి. పుత్ర రత్నాలు ఎలా వున్నారోనని రాజు-రాణిలకు బెంగ వేసింది. రాజు గారు బయలుదేరి దేవరకొండ వెళ్లారు. రథ సారథి గుర్రాలకు నీళ్ళు పెడుతున్నాడు. "అయ్యగార్లు ముగ్గురూ ఆశ్రమానికి వెళ్ళారండి" అన్నాడతను.

"మరి నువ్వు ఇక్కడెందుకున్నావు? వాళ్లతో వెళ్ళలేదేమి?" అని కోపంగా అరిచాడు రాజు. "మరండి.. బాబుగార్లండి.." అంటాడు గానీ సారథి నోరు తెరిచి ఏమీ చెప్పలేకపోయాడు.

రాజుగారు గబగబా గుర్రాన్నెక్కి, నది ఒడ్డుకు చేరుకున్నారు- "ఈ నదిని ఎట్లా దాటాలో ఈ సమయంలో" అనుకుంటూ.

తీరా వెళ్ళేసరికి రాకుమారులకోసం ఉద్దేశించిన పడవ ఈ ఒడ్డునే ఉంది- "రాకుమారులేరి?" అడిగాడు రాజు.

"ఆశ్రమానికి వెళ్ళారండి" అన్నాడు నావికుడు, పడవని బయలుదేరదీస్తూ.

"నువ్వు వాళ్లని దిగవిడిచి అక్కడే ఉండాలి

కదా, ఇటువైపు ఎందుకు వచ్చావు?" అడిగాడు రాజు కోపంగా.

"మొదట్లో ఒక్క వారం రోజులు పడవలో దిగవిడిచి వచ్చాను అంతే ప్రభూ తర్వాత ఏవైనా నౌకా విహారాలకు తప్పిస్తే అయ్యగార్లు నా నావని ఎక్కటమే లేదండయ్యా" విన్నవించుకున్నాడు కళాసీ.




రాజుగారి హృదయంలో తుఫాను రేగింది. గబగబా మిత్రవిందుల వారి ఆశ్రమానికి చేరుకున్నారు.

ధ్యానంలో ఉన్న మిత్రవిందుడు ఆయన్ని చూసి లేచి వచ్చి "రాకుమారులు ముగ్గురూ బాగున్నారు ప్రభూ. విద్యలు చక్కగా నేరుస్తున్నారు. రండి" అని లోనికి పిలుచుకు వెళ్ళారు. లోపల మిగిలిన పిల్లలతో పాటు చక్కగా సాధన చేస్తున్న రాకుమారుల్ని చూసి రాజుగారి మనసు కుదుటపడ్డది.

పనిలో ఉన్న రాజకుమారులు మధ్యాహ్నం భోజన సమయంలో వచ్చి, తండ్రిని పలకరించారు, ఆయన్నికూడా పిల్చుకొని వెళ్ళి తమ తోటి విద్యార్థులను అందరినీ పరిచయం చేసారు; అందరితో పాటు భోజనం పెట్టించారు. వారిలో ఇప్పుడు ఆర్నెల్ల క్రితం ఉన్న సోమరితనం, బద్ధకాల చాయలు కూడా లేవు!

గుమ్మడికాయల లెక్కన వుండే రాకుమారులు ఆర్నెల్లలో సొరకాయల లెక్కన సన్నబడటం చూసి రాజుగారు సంతోషపడినారు. వారిలో వచ్చిన మార్పుని చూసి రాజుగారికి ఆశ్చర్యం వేసింది- 'పూచికపుల్ల సైతం ప్రక్కకి తీసి పెట్టని రాకుమారులు ఇంత చలాకీగా ఎలా తయారైనారు?' అని.

"రాకుమారులు ముగ్గురూ చాలా మంచి పిల్లలు మహారాజా! రథాన్ని, నౌకల్ని ఎప్పుడో తప్ప, అసలు వాడనే వాడరు. ప్రతిరోజూ ఉదయం నది ఒడ్డు వరకూ పరుగెత్తి వస్తారు; అటుపైన నది ఈవలి ఒడ్డు వరకూ ఈదుతారు. సాయంత్రం వెళ్ళేటప్పుడు కూడా అంతే.



ఉదయం నుండి యోగాలోను, శాస్త్రపఠనంలోను, క్రీడాభ్యాసంలోను, యుద్ధ-క్రీడల్లోను పాల్గొంటారు. వీటన్నింటి వల్లా వాళ్ళ శరీరం బలంగా తయారైంది. ఆరోగ్యవంతమైన శరీరంలో ఆరోగ్యవంతమైన మనస్సు ఉంటుంది" వివరించారు మిత్రవిందులు.

"అయినా, అంత దూరం నదిలో ఈదుతారా, మా పిల్లలు?!" ఆశ్చర్యం ప్రకటించారు రాజుగారు.

"రాజా! సరైన కృషి ద్వారా మన శరీరాన్ని, మనసును శుభ్రం చేసుకున్నప్పుడు, చుట్టూ ఉన్న ప్రాణశక్తి మనలోకి ప్రవహించ-గల్గుతుంది. చాలా పని చేయగల్గుతాం. ఈ ఆరు నెలల్లోను రాకుమారులు తమలోని ప్రాణశక్తిని గుర్తించారు. ఉత్సాహంగా శ్రద్ధ చూపుతున్నారు. వారికి ముగ్గురికీ మంచి భవిష్యత్తు వుండగలదు" అని ఆశీర్వదించారు మిత్రవిందులు.

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 23/07/2019 Postal Regn No: HDP/008/2018-2020

చూడటం-చదవటం

ఈ మధ్య అందరూ బాగా చూస్తున్నారురా, కానీ చదివేవాళ్ళు మటుకు తగ్గిపోతున్నారు!" అన్నాడు తాతయ్య, విచారంగా నిట్టూరుస్తూ.

"అంటే నీ ఉద్దేశం అందరూ టీవీలు, సినిమాలు 'చూస్తున్నారు'; పుస్తకాలు 'చదవట్లేదు' అనా?" అడిగాడు కిట్టు.

"ఊహు. అట్లా చెబితే సెల్ఫోనులు ఎటు పోవాలి" అంది బియ్యం ఏరుకుంటున్న బామ్మ, చాటలో బియ్యాన్ని మరింత శ్రద్ధగా చూస్తూ.

"అట్లా కాదు, నేనంటోంది. ప్రాణులుగా మనకి భాష దూరమై పోతున్నది అని. నేనే వివరిస్తాను ఆగు:

అసలైతే చదువు వచ్చిన వాడికీ, చదువు రాని వాడికీ ఇద్దరికీ 'చూడటం' మటుకు వచ్చు. సినిమాలు, టీవీలే కాదు; ఏ రోడ్డు మీది పోస్టర్లు అయినా సరే, ఇద్దరూ 'చూస్తారు'. అయితే అట్లా చూసాక, చదువుకున్న వాడు దాన్ని ఇంకొంచెం వివరంగా, 'చదువుతాడు'. అయితే ఈ మధ్య చాలా మంది 'చూడటం' లో పడి, 'చదవటం' మానేస్తున్నారు. ఎందుకంటే, వాళ్ళకి 'చదవటం' అనే యీ ప్రక్రియ సులభంగా లేదు. సహజాతంగా అనిపించట్లేదు. అదొక బరువు లాగాను, కృతకంగాను అనిపిస్తోంది. దీనికి కారణాలు వెతుక్కొని సవరించుకోవాలి అందరం " అన్నాడు తాతయ్య.

"బానే వుంది. ఇంతకీ మీ చొక్కా ఏ రంగుది?" అడిగింది బామ్మ టక్కున.

"నీలం రంగు!" అన్నాడు తాతయ్య చటుక్కున.

"మరి దాని కాలర్ మీద టైలరు పేరు ఒకటి ఉంది- ఏం టైలర్సో చెప్పు, చూద్దాం!" అన్నాడు రంగా ఉత్సాహంగా.

"నాకు తెల్సురా, రమేష్ టైలర్సు. ఇప్పుడు నీవంతు: మీ ఇంట్లో వ్రేలాడే క్యాలండరును ఎవరు ముద్రించారో చెప్పు చూద్దాం?" తిరగబడి, నవ్వాడు తాతయ్య.

రంగా తెల్లమొహం వేశాడు. "అదీ...అదీ..ఏదో రాసి ఉంటుంది. దాని అంకెలు పెద్దగా ఉంటాయి, నీలం రంగులో!" అన్నాడు.

"అదేరా. నేనంటున్నది. రంగు చూస్తాం; సైజు చూస్తాం; కానీ ఆ అక్షరాల్ని మటుకు చదవం! ఇట్లా ఎందుకు అవుతున్నదో జాగ్రత్తగా చూడాలి. దీనికీ, ఇష్టంగా చదవటానికీ, మాతృభాషకీ ఏదో సంబంధం ఉంటుంది కచ్చితంగా. సులభంగా, సహజంగా అయిపోగల 'చదవటం' అనే ప్రక్రియని, బలవంతంగా, బరువుగా, కృత్రిమంగా చేసుకోవటంలో పెద్ద మోసం ఉంది.." అన్నాడు తాతయ్య, మళ్ళీ ఓసారి నిట్టూరుస్తూ.

“Kottapalli” Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.